ఒంగోలు కస్బాడిపాఠము

క్రై. యు. సమాజమునకు

కృతజ్ఞతాపూర్వకముగ సమర్పితము.

1929.

ఒంగోలు కబాడిపాలెము

క్రై. యు. సమాజమునకు

కృతజ్ఞతాపూర్వకముగ సమర్పితము.

1929.

ఒంగోలు కబాడిపాలెము

క్రై. యు. సమాజమునకు

కృతజ్ఞతాపూర్వకముగ సమర్పితము.

1929.

ఒంగోలు కబాడిపాలెము

క్రై. యు. సమాజమునకు

కృతజ్ఞతాపూర్వకముగ సమర్పితము.

1929.

# విజ్ఞాపన

భారత మహాశయులార !

భాషాజ్ఞానమును, వ్యాకరణ ఛందశ్శాస్త్రములందు పరిచయము నా కంతలేకపోయినను, నే నిదివఱకు వ్రాసిన భ్రాతృద్రోహి, మోసేపు నాటకముల వలన నాకుఁ గలిగిన ప్రోత్సాహముచేత మఱియొకటైన నొక నాటకము వ్రాయఁ దొడంగితి. అరవభాషలోఁ జెప్పఁబడు నొకానొక కథ మదికి స్ఫురింప, నా కథలో నూతన పాత్రలు కొన్నింటిని బ్రవేశపెట్టి "రత్నమంజరి" అను నీ నాటకమును మీ కందించుచున్నాఁడ.

ప్రపంచమందు సవతితల్లులందఱును మన కథలోని సముద వలెఁ గఠినహృదయలై సవతిబిడ్డలను గ్రూరముగా బాధింతురనియు, సవతిబిడ్డలందఱును శాంతస్వభావులై తమ కృతికాంబలకడఁగి మడఁగి యుండి, వారిని గౌరవించి, మన కథానాయక "రత్నమంజరి" వలె సహనశక్తి ఘటియింతురనియు నా యభిప్రాయము కాదని పాఠకులకు విజ్ఞప్తి.

చందనకాష్ఠము నెంత రాచిన నంతే సువాసన యుప్పతిల్లునట్లు, తునియఁ గొలఁది, నమలఁ గొలఁది చెఱకు రసమునిచ్చునట్లుఁ, బుటము వేయుకొలఁది బంగారునకు వన్నె హెచ్చునట్లు సత్పురుషునకు దన జీవితయాత్రయందుఁ గష్టములు హెచ్చుకొలఁది తన గుణమెక్కుడుగా ప్రకాశించుననియు, సహనగుణమే జీవయాత్ర కూఁతగా భావించి యపకారుల కుపకారమొనరించు నరునకు నైహికాముష్మిక సుఖములు కరస్థములగునను విషయములే నా ముఖ్యోద్దేశకములని పాఠకులు గ్రహింతురుగాక.

ఈ గ్రంథ ముద్రణసమయమున నన్నుఁ బ్రోత్సాహపరచి నాకు ద్రవ్యసహాయమొసంగిన నా మిత్రులకు హృదయపూర్వక వందనములర్పించుచున్నాఁడ.

ఈ గ్రంథమందుఁ గనుపించు కవితారచనా స్ఖాలిత్యముల మన్నించి గుణగ్రహణ పారీణులగు పాఠకులు సుగుణములనే గ్రహింప ప్రార్థితులు.

25-3-1929, ఒంగోలు.

విధేయుఁడు

గ్రంథకర్త.

# ఈ నాటకమందలి పాత్రములు.



## పురుషులు.

1. బుద్ధిసాగరుఁడు—భౌమసార్వభౌముఁడు.
2. చంద్రశేఖరుఁడు—మంత్రి.
3. పోలుగాఁడు—కిరాతుఁడు.
4. శ్యామమోహనుఁడు—రత్నమంజరి భర్త.
5. సమరసింహుఁడు—మణిస్తంభ దేశాధిపతి
6. అహమ్మద్ ఖాన్— } సమర భటులు
7. ఖుస్రూఖాన్— }
8. బుడ్డేసాహెబ్—సమరసింహుని భటుఁడు.
9. సేవకులు—ఇద్దరు
10. వీరఁడు—వెట్టివాఁడు
11. ఆనందయోగి.
12. దేవదూత.

## స్త్రీలు.

1. సముద్ర—చక్రవర్తిని.
2. రత్నమంజరి—బుద్ధిసాగరుని పుత్రిక కథానాయక.
3. సుందరి—సముద్ర దాసి.
4. వెంకి—కిరాతుని భార్య.



శ్రీరస్తు.

# రత్నమంజరి

## నాటకము.

### ప్రథమాంకము—ప్రథమరంగము.

(సభాభవనము).

(బుద్ధిసాగరుఁడు, చంద్రశేఖరుఁడు ప్రవేశించి)

బుద్ధి—(స్వ) ఆ॥ వె॥ రాజ్యమెంతయున్న • రక్షకభటులున్న
నైహికసుఖమెంత • నందనున్న
సతిసుతాదులున్న • సామర్థ్యమున్నను
జనపతులకు సంత • సంబు సున్న.

(ప్ర)-చంద్రశేఖరా! మిన్నువిఱిగి పైఁబడినటుల మన సామ్రాజ్యమున కెన్ని యిక్కట్టులు వాటిల్లెనో చూచితివా?

చం—సార్వభౌమా! అంతటి యిక్కట్టులేల?

బుద్ధి—ఆహా! ఈ యపారసామ్రాజ్యమున మేరలేని యల్లకల్లోలములుద్భవించుట వినియు, కనియు నీబుద్ధిసాగరుఁడు కడుపార భుజియించునె? కన్నారనిదురించునె?

చం—ప్రభువర్యా! మనకు దాపురించు కష్టములకు కారణభూతులెవరు?

బుద్ధి—ఎవరననేల? అందు ముఖ్యముగా మన సామంతులే గదా?

చం—ఏమేమి? మన సామంతులా? ఎందుచేత?

బుద్ధి—అమాత్యా! ఎందుచేతనా? మదాంధులై యధికారాహంభావ

ముచేజిక్కించుకొని, ప్రజల నల్లాడింపనుద్యుక్తులైరి కదా! ఇనుఁడు గ్రుంకుచు ట్టకే తెంచినంత మాత్రమునఁ దారలెల్లఁ బ్రబలునట్లు నాపరోక్షమందు దాపురించెనుగాదె. ప్రభువనఁగ నూరబందికూడ ?

చం——అటులైనచోఁ జేయునదేమి ?

బుద్ధి—— రాగ-బేహాగ్. కీర్తన. ఆదితాళము.

ధరాస్థలినినా - పరాకునెఱుఁగక - బిరానజని సామంతులను - ఆ
రమరలేక - కరుణకనక - అరులబ్బెద - శిరముల్
గొట్టెద॥ ధరా॥
పాపభీతులచేత - నోర్చితి నింతదనుక - కోపముబుట్టెను - కోటలు
గూల్చెద॥ ధరా॥

చం——"అలన్యమమృతం విషం" అను లోకోక్తి మఱువరానిది నుమీ!

బుద్ధి——ఇది యటులుండ ఇంటివారికెలు జూపిన బయటివారు బాకులు జూపుదురను నార్యోక్తి కల్లగాదు.

చం——నృపాల ! బయటివారు మనకు శత్రువులెట్లు ! యుద్ధమునకు రాయబారమంపిరా ?

బుద్ధి——ఉ. ఉత్తరరాజ్యమందు ప్రజ • లోర్వక దుష్టుల బందిపోట్లచే
దత్తరవోయి దాగిరఁట • దారుణ కాననసీమలక; బళీ !
మత్తనరాధమాఘములు• మాత్రము జంకక సంచరింపఁగక
ఉత్తమధర్మమాచరణ • కూఁతగ నిల్పవె మత్కృపాణమే.

చం——దేవా ! దక్షిణరాష్ట్రమంతయు నటులనే జార-చోరభయకంపితమై వణకుచున్నదఁట.

గీ॥ మున్ను వినికని యెఱుఁగని • ముప్పులెల్ల
ఘోరరిపు పుంజములబోలి • గూడె మనకు;
గుండెలదరి ప్రజలు భయ • కూపమందు
మునిఁగియుండంగఁ గాపాడఁ • గనుమునాథ !

బుద్ధి—అవును. శిష్టజనరక్షణయు, దుష్టజనశిక్షణము నలుపుట రాజుల విధికృత్యము. గావున రేపో మాపో నగరమువిడచి దేశాటన మొనర్చెదను.

ఉ॥ శ్రీకరమై మహాసుజన ♦ సేవితమై దనరారు రాజ్యముఁ
జీకటిఁగొంపగాఁ దలఁచి ♦ చేటొనరింపఁగ జూచుచోరులఁ
భీకరమత్కృపాణమునఁ ♦ బ్రేవులుదీసి ప్రజాళికెంతయో
సేకుర్చఁజేయఁగఁ సుఖము ♦ చెల్వుగ మత్భుజశక్తిజూపెదఁ.

చం—సార్వభౌముని యసమాన బలపరాక్రమములు ముజ్జగముల వెలు గొందనిదియె తరుణము.

బుద్ధి—చంద్రశేఖరా! సామ్రాజ్యసంచారము సంపూర్తిగాఁజేయుటకు బహుకాలము పట్టును. ఏను నగరమందు లేనితఱి రాజ్యాంగ వ్యవహారము లెట్లు నడపెదవో నీభారము.

సీ॥ రైతులక్షేమంబె ♦ రాజులపాలిఁటి
ధనధాన్య నిధియని ♦ తలఁపుమయ్య
సుంతయైనను గీడు ♦ జొరనీక కాఁపులఁ
కంటికి ఱెప్పగా ♦ గావుమయ్య;
నీతిశాస్త్రంబుల ♦ నెలకొల్పి రాజ్యాన
సజ్జనాళికి మేలు ♦ సలుపుమయ్య;
ప్రజల సౌఖ్యంబుకై ♦ ప్రాణంబులర్పించి
శ్రేయంపుఁ బనులెల్ల ♦ జేయుమయ్య;
గీ♦ పేదవారల ముదమార ♦ నాదరించి
గురుతరయశస్సు నెంతైన ♦ గూర్పుమయ్య;
ముక్తిఫలదాయకంబులై ♦ ముద్దులొలుకు
ధర్మమార్గంబు లేప్రొద్దు ♦ దలఁపుమయ్య,

చం—నృపాల! రాజ్యాంగములలో నానేర్పరితనంబెఱింగియు మీరు లేని తరుణమందు రాజ్యకృత్యముల నడపుదునో యని శంకింపనేల?

ప్రథమాంకము.

కం॥ వికలతనొందకు దేవా!
ప్రకటితముగ మీదుహృదయ • భావముగనియున్
త్రికరణశుద్ధిగ జేయుదు
సకలప్రజాళికి సుఖంపు • సామ్రాజ్యమ్మున్.

బుద్ధి—మంత్రివర్యా! రాజకీయవ్యవహారములలో నీ యసమానచాక చక్యము నే నెఱుంగకపోలేదు. అయినను చెప్పవలసిన విషయము గనుక చెప్పితిని. ఇంక సత్వరముగా వెడలి యసంఖ్యాకములై చతురంగబలముల నాయత్తపఱపుము.

కీర్తన—"మన సచివుని దునిమెనట" వలె.

మదమడంపగ - నిదెచనియెద - ముదమారంగ - బదిలముగా - నధములగు సామంతులన్ - వదలక నాచోరులన్ - పట్టెదన్ - కొట్టెదన్ - కూల్చెదన్॥ మద॥

అక్కటా! యింక పెక్కులిడుములు - పెక్కుమరణము - లొక్కటై యెటు ప్రాప్తించునో - వీకతోడనిదె - వేగబోయెద - చాకచక్యము జూపెద॥ మద॥

(నిష్క్రమింతురు)

---

ప్రథమాంకము—ద్వితీయరంగము.

(భ వ న ము)

(బుద్ధిసాగరుఁడు ప్రవేశించి)

(స్వ) ఆ॥ వె॥ సకలజంతువితతి • చనుబాలు విడచినన్
తల్లిదండ్రులేరొ! • పిల్లలేరొ!
కాని, మనుజులుర్వి • బ్రాణముండుదనుక
నొకని నొకరుబాయ • నొప్పుకొనరు.

హృదయమా! నీవేల నింత పరితాపమొందెదవు? తదేక పుత్రియైన రత్నమంజరిని విడచి దేశాటనము బోలేక గదా యింతగాఁ గుందుట. ఒక్కపసిబాలచే బంధింపఁబడిన నెయ్యంపు బాశంబును సకలప్రజాళిపైఁ బరుగిడు ననురాగము తెగఁద్రుంప కుందునా? పురిటిలోఁ దల్లి నిన్ను బాసినది మొదలింత కాలము తల్లినిమఱపించి యెంతయో గారాబముగా నినుఁబెంచిన కతనఁ గదా నిన్ను విడచిపోవఁ గాళ్లాడకున్నవి. ఎట్లైనను బోవక తప్పునా? ... ... ... ... ... ... తప్పదు. తప్పదు. ముమ్మాటికిఁ దప్పదు. (ప్ర) కుమారీ! ముద్దులపట్టీ! యిటురమ్మా.

(రత్నమంజరి ప్రవేశించును.)

రత్న—జనకా! ఇదేవచ్చితి. సెలవిండు.

బుద్ధి—ఇటుకూర్చుండుము.

రత్న—(కూర్చుండును) నాయనా! సభాభవనమునుండి నేడింత త్వరితముగా వచ్చితిరేల?

బుద్ధి—పుత్రికామణీ! రేపు దేశాటనముఁ జేయవలసి యున్నది. పయనముకొరకుచిత సన్నాహములు గావింపవలసినందుచె బెంగలకడనే వచ్చితి.

రత్న—నాయనా! ఊరినుండి యెప్పుడు తిరిగివచ్చెదరు?

బుద్ధి—అమ్మా! దేశాటన మెంతకాలము పట్టునో నుడువఁజాల.

రత్న— కీర్తన—“హా! ముసె బదనకబల” వలె

తాళజా - లుదునెజనక! - యిటులఁబాయఁగ - నీకుమన
సొప్పెనా? - ప్రేమనాపైఁదప్పెనా? ॥తాళ॥
బాలనే - పసిబాలనే - యేలననుఁబాసిపోదువు? - కాళు
లెటులాడెనయ్య? - యెవరుననుఁ బ్రోతురయ్య? ॥తాళ॥

బుద్ధి—నారతనాలమూట! నీవు భయంపడవలదు. నేను దేశాటనము సేయకతప్పదు.

తం॥ పలువిధశత్రుప్రివ్రల్ సెలఁగి ♦ పల్లెలుకూటములన్నిటిc గనుం
గలఁతలబెట్టుఁగc బ్రజలు ♦ కష్టములొందిరఁటంచువింటి, నే
నలయకపోయి రాజ్యగతి ♦ నారసివైరులఁజంపి శాంతినిc
బలముగ జేయుందలమి ♦ వచ్చెదశీఘ్రిమ రత్నమంజరీ!

అమ్మా! భవనమున నీకుకొఱఁతయేమి? నీకడ్డెవరు? హాయిగాఁగుడిచి యింట గూర్చుండుము. నీ సంగడిగత్తెలతో నాడుము.

రత్న—కం॥ ఎవ్వరితో నిఁక నాడుదు
నెవ్వరితో నాడుకోర్కు ♦ లెల్లవచింతుc
దవ్వున నీవరుగునపుడు
నవ్వులకో సౌధవీధి ♦ నరకముగాఁగc

బుద్ధి—(స్వ) కటకటా! మానవునకు కాలమే సద్గురువు. కుమార్తెకు వయస్సువచ్చుకొలఁది సవతితల్లిచేష్టలు తన మదికి కష్టముగాఁ దోచునట్లు గనుపించుచున్నది. ఎట్లయినను బుత్రికకభయమీయకున్న నాకార్యము తుదముట్టదు. (ప్ర) అమ్మా! నాకున్న సమస్తసంపదలునీవి. సమస్తరాజ్యము నీయది. అఖిలవైభవములు నీయవి. నీశ్రేయస్సు నారయుటకునింట నీపినతల్లి యున్నదుగాన నీవు వగవంబనిలేదు.

రత్న—జనకా! సవతి తల్లియుండియు లేకయు నొకటేగదా?

గీ॥ కల్పవృక్షంబు కాంక్షించి ♦ కరము మోడ్చి
గడియప్రార్థింప ఫలితంబు ♦ గలుగుగాని
గచ్చచెట్టుకు నిరతంబుc ♦ గడఁగి మొక్క
ఫలముసిద్ధింపనేర్చునే ♦ పలుకుజనక!

బుద్ధి—(స్వ)కుమార్తెకు జ్ఞానాంకురములు మొలక లెత్తుచున్నవిగదా?
(ప) కుమారీ! బాలికవైనందుచేత కేవలము లౌకికజ్ఞానమొకుం

గక యున్నావు. ఇట్టి మాట నాతోడ నన్నట్లు నీతల్లితో నన బోకుము.

కీర్తన. "కలికీ నేకలఁగంటి" వలె

ఇటులాడఁ దగదమ్మా! సవతితల్లులెల్లరు - కతినాత్మ
లై యుండరవనిలోన - కుటిలభావములేకను - గూర్మితో -
నోర్మితో - ముదమారఁగఁ గనులగనియు - మోదమున
మనుపరా? ॥ఇటు॥

రత్న—(స్వ) జనకుఁడు నాపైఁ గినుక నొందినటులున్నది. (ప్ర) నాయ
నా! నే నేమో యంని. క్షమియింపుము.

బుద్ధి—రత్నమంజరీ! నీకొకమాట నుడివెద. ఆలింపుము.

గీ॥ పట్టిజలవేణులనుఁ నాపఁ ♦ గట్టలుండు;
పెగలుపెను గాలి నాపంగ ♦ నగములుండు
ఘోరమృగముల బట్టంగ ♦ గొలుసులుండు;
నోరుజారుమాటల నాఁప ♦ నేరులేరు.

అమ్మా! నేఁ జెప్పినటుల వర్తింపుము, నామాటలు నీకెంతయు శ్రేయో
దాయకములగును.

ఆ॥ వె॥ సవతితల్లిమాట ♦ జవదాటబోకమ్మ
కలసి మెలసియెంతొ ♦ మెలగుమమ్మ.
అణఁగి మణఁగియుండ ♦ నతి శ్రేయమగునమ్మ.
పెద్దవారికిదియె ♦ విధియుసుమ్మ.

పుత్రికామణి! ఈమూఁడుమాటలను నీహృదయమున నలంకరించుముఁ
ఏమో జెప్పితిననఁ బోకుము. అదిగో! దాసి నీ కొఱకెదురుఁ
జూచుచున్నది. పొమ్ము.

(నిష్క్రమింతురు.)

---

# ప్రథమాంకము.

## తృతీయ రంగము.

(బుద్ధిసాగరుఁడు, సమదప్రవేశింతురు.)

బుద్ధి—ప్రాణనాయకీ! ప్రస్తుతము సామ్రాజ్యమం దల్లిబిల్లిగా నల్లుకొనిన యల్లరులును, అందుపై వానినడఁప నా యుద్యమమును నీ కెఱుఁగని విషయములుగావు. దేశాటనమునకు మునుపు కొన్ని విషయములు నీతో వెలిఁబుచ్చిపోయెద. వాని నెట్టు శిరసావహించి నిరంతర యశస్సు గడించెదవో యని శంకించుచున్నాను.

సమద—(స్వ) నాథుఁడు సకల సామ్రాజ్యమేల నాధిక్యము నాకొసఁగి రాజ్యభారము నాకరస్థము గావింప నుద్యుక్తుఁలై యున్నటుల దోఁచుచున్నయది. (ప్ర) ప్రాణేశ! తమ భావము వెలిఁబుచ్చి నన్ను ధన్యరాలఁగాఁ జేయుము.

బుద్ధి—తల్లిని బాసినది మొదలు రత్నమంజరిని నేనెంత గారాబముతోఁ బెంచుచుంటినో నీవెఱుఁగక పోలేదు. నేను దీర్ఘకాలము దేశాటనము జేయుచుండ రత్నమంజరినెట్లు గాపాడుదువో నీ భారము సుమా?

సమ—నాథా! ఈకుంటి మూఁడక్కరములకొఱకేనా యింత దీర్ఘమైన యుపోద్ఘాతము. చాలుచాలు. నీగారాబపుఁ బుత్రికను నీతోనే గొనిపొమ్ము. నీ కూతునకును, నాకును గడియమైన గిట్టదు.

బుద్ధి—(స్వ) ఆదిలోనే హంసపాదియన్నట్లు నా యభిప్రాయము చక్కగా వెలిఁబుచ్చనిదే ప్రాణసఖి కింతటి యాగ్రహము గలిగెను. ఇంక నేనుఁ జెప్పదలంచిన విషయము బలుకుటెట్లు? (ప్ర) కోమలాంగి! అహోరాత్రములు రణరంగములోఁ గాలము గడుపు నేను రత్నమంజరి నెట్లు వెంట గొనిపోవుదును? అంతియకాక

పుత్రికను నేను గోనిపోయిన సవతిపుత్రికను సద్రీతి నడిపించి పెద్దదానినిజేసి యపారయశస్సు నార్జింప నవకాశ మెట్టులొదవు?

మ॥ తనువుల్ దొట్టినబిడ్డలన్ గ్రమముగాఁ • దాల్మిన్ మహాప్రేమతో
మనుపన్ భూతలమందు నొందగలరా • మాతల్ యశోతేజముల్
వినఁబ్రఖ్యాతియె మారుదల్లికృపచే • వెవ్వేరుసౌఖ్యంబులన్
తనసంతానమఁటంచు నాసవతి సం • తానంబుఁగాపాడఁగన్.

సమ—నాథా! నిన్ను వివాహమాడినది మొదలిట్టి శ్రీరంగనీతులె బలుకుచుంటిరి. వినివిని చెవులకు చవిదప్పె. నూతనవిషయ మేమైన జెప్పుదురని గంపంతయాశతోఁ గనిపెట్టియుంటిని.

బుద్ధి—కోమలి! నాపై యలుకఁ జూపకుము. తాల్మితో వినుము.

సమ—అయ్యో! నా యలుక మిమ్మేమిజేయును? నే నెంత? నా యలుకెంత? నా చిన్నారి, నా పొన్నారి, నా రతనాలమూట, నా వరహాల కుప్పయని రేలును బవళ్లును మీరు సంబోధించు నీ ముద్దులపుత్రిక రత్నమంజరి యలిగినగదా మీకు దిగులు. (దూరముగాఁ బోయి నిలుచును.)

బుద్ధి—(స్వ) ఓహో! ఇఁకను పెదవిగదలించిన పెనుభూతమువలె పైన బడునటుల దోఁచుచున్న యది. పురుషుఁడెంతయు వెలపట నధికారము నిరంకుశముగాఁ జేయనోఁపు గాని భార్యదగ్గఱమాత్ర మా రీతి దగదుగదా?

౹॥ వె॥ అఖిల మానవాళి • నరచేత నాడించి
పురుషుఁడధికకీర్తిఁ • బొందుఁ గాని
సకల లోకమేలు • చక్రవర్తియుగూడ
పొలఁతిచేతికీలు • బొమ్మగాదె.

ఇఁకను దండోపాయము ప్రయోగింప గండము నిక్కువము. సామోపాయమే ప్రస్తుతము సాధనము కనుక నా తప్పు క్షమింపుమని బ్ర-

తిమాలిన నాకు పరాభవమేమి? పత్ని నాపైఁ గోపమించుక
జూపనుగాని వేరొండుగాదుగదా?

ఆ॥ వె॥ అలిచేతకొంద • అమరంగదన్నులు
దినియుఁ గీర్తినొంద • మనిరిదొల్లి,
అట్టిఫలమునాకు • నమరనందుకు నేనె
ధన్యుఁడైతి మిగులఁ • దలఁచిచూడ.

కీర్తన. (సంవాదము) ‹‹హారెసయ్యా! బాదుమై" వలె.

బుద్ధి—ఇందువదనా! - పొందుగాఁ దాల్మిజూపి - మందలించు
నా దోషమేమిటో?

సమ—దోషంబునెఱుఁగని దొడ్డదొరవె?

బుద్ధి—దూషింపబోకు చాల-

సమ—వేషధారిపల్కు_లేల?

బుద్ధి—కృపగనుము

సమ—ఇఁక జనుము.

బుద్ధి—మొరవినుము

సమ—రాననుము

బుద్ధి—॥ఇందువదనా!॥

బుద్ధి—అలుకఁజెంది - పలుకఁగా నీ రీతి - కలికిరో నే నేమిసేతు?

సమ—కలవాణి నీమదిలోదలఁపనెంత?

బుద్ధి—పలుకరాదేఁ ఇలకొంత! -

సమ—అలివేణి వేడఁగవింత (నవ్వును)

బుద్ధి—మనజాలఁ

సమ—అనజాలఁ

బుద్ధి—దయజూడు

సమ—భయమువీడు॥

బుద్ధి—గీఇఁదు॥

బుద్ధి—(స్వ) ఆహా! స్త్రీ లెంతబేలలు. నా తప్పులుమన్నింపుమని భర్త భార్యను వేడిన నుబ్బి తబ్బిబ్బులాడి కొండంత కోపమునైన విడచినెయ్యంపుఁ జూపులఁ జూతురు.

సమ—నాథా! నాకుజెప్పిన లాభమేమి? సవతితల్లులయెడల నెటుల బ్రవర్తింపవలయునో కూఁతుకు జెప్పిపొమ్ము.

బుద్ధి—సఖియా! రత్నమంజరికి గఱపవలసిన హితోపదేశమంతయు గఱపితి.

సమ—నిజముగాఁజెప్పితివా? రత్నమంజరీ! యిటురమ్ము.

రత్న—(ప్రవేశించుచు) అమ్మా! యిదే వచ్చితి.

సమ—రత్నమంజరీ! నీ జనకుఁడేమి హితోపదేశముజేసెను:

రత్న—అమ్మా! మీ యెడల నేను కడుభక్తితో మెలఁగవలయునని యు, నొకవేళ మీరు కోపించినను సహనముఁ జూపవలయు ననియుఁ జెప్పెను.

సమ—నిజముగా నట్లుప్రవర్తించెదవా?

రత్న—తప్పక......ప్రవ...ర్తించెద.

సమ—సత్యముగా బలుకుచున్నావా?

రత్న—స......త్య......ము - గానే పలుకుచున్నాను.

సమ—గీ॥ జననిమాపించినను గొట్టి • ననుదలంపఁ

బోరు, కృతకాంబయే మాత్రి • మును నిటన్న (మొట్టును)

రత్న—(తలపట్టి) నాయనా! నాయనా! ఎంతదెబ్బఁగొట్టినదో చూడు

సమ—నదియభయదంష్ఫ్రఁ జిడుగుగా • నాలకింతుౕ

రాజ! లోకసామ్యముమూరు • నాజగాన?

పాణనాయకా! ఇంతమాత్రమున కోర్వలేక వాలముదెగిన జంబుకముఁబోలి యెంతబిగ్గరగాఁ గేకలువేసెనో చూడుము. ఇట్టి అల్ల

రికుమార్తెతో నేనెట్లు మెలఁగవలయునో దెలియలేదు.

బుద్ధి—రత్నమంజరీ! నీవిఁకపొమ్ము. (రత్నమంజరి నిష్క్రమించును.) కమలాక్షి! తల్లిప్రేమ యెట్టిదో బాగుగా గ్రహింపఁదగిన ప్రాయమింకను మన రత్నమంజరికి రాలేదు. వచ్చిన యట్టి స్వల్పవిషయమును బాటించునా?

చ॥ మురువుగ దేనికై యొకఁడు ♦ ముంజెయిజాపఁగ దేనెటీగలున్
చురచురవానిఁగుట్ట మది ♦ సొంపుగనోర్వఁడె దేనికాంక్షచే?
దరుగనికూర్మినిన్ సవతి ♦ తల్లులు బ్రోచుచు నప్పుడప్పుడున్
చురచురచూపులన్ గసర ♦ సూక్ష్మగతిన్ గడునోర్చుబిడ్డలున్.

ప్రాణప్రియా! కడపటిమాట యిదే వినుము.

సీ॥ చిఱుతప్రాయమున ♦ చిఱుతకు నెట్టులో
పోషించి దయజూడు ♦ పుణ్యబోఁడి!
సకలసౌఖ్యముబొంద ♦ సముచితంబుగ మెచ్చు
వస్తుసంచయమెల్ల ♦ వనిత! యిడుము
పట్టుచీరెలుగట్టి ♦ పసిఁడియాభరణముల్
నిలువెల్ల దొడఁగించు ♦ నీరజాక్షి!
కన్నతల్లికరణి ♦ గారాబముదయింప
నన్ని తెరంగుల ♦ నరసిబ్రోవు;

గీ॥ తెలిసి తెలియక పసిబాల ♦ బలుకుటరసి
కోపమొక్కింతయును లేకఁ ♦ గూర్మిగనుము
నేడఖిల భూతములెఱుంగ ♦ నీదుప్రేమాల
నిదియె నాదుప్రార్థనయంచు ♦ నింతి వినుము.

ఇదే పోవుచున్నాను. (నిష్క్రమింతురు)

---



# రత్నమంజరి నాటకము.

## ద్వితీయాంకము—ప్రథమరంగము.

-*-

[రత్నమంజరి తలపై చేటతో ధాన్యమును, భుజముపై రోకలియుఁ గొని - ప్రవేశించుచు]

కీర్తన. «మంగళహారతిదేర» వలె

రత్న—ఎన్నఁడు బాసిపోవునో - యీ శ్రమములు ననువిడచి ॥ఎన్నఁడు॥
కన్నతండ్రిదూర - రాజ్యమునకరుగ - చిన్నిచూపులతో సవతి - తల్లిననుజూచుట ॥ఎన్నఁడు॥

1. దాసివలెనింట - నీచసేవకత్వము - జేసిన ఫలములేదు - దూషణాదులింక ॥ఎన్నఁడు॥

2. తనకున్న వ్రాతలు దైవము నుదుటవ్రాయ - నెక్కువ ఫలము గోరగ దక్కునె సుఖములు ॥ఎన్నఁడు॥

(స్వ) కటకటా! దైవమా! సార్వభౌముని పుత్త్రికనై పెక్కండ్రు దాసీజనములచే సకలోపచారములఁ బడయవలసిన నేను సవతితల్లికి దాసినై యంతఃపురములో సకలసేవయొనరించినను నా యందు నించుకైనను దయాదాక్షిణ్యములు జూపదాయె. ఊడిగంపుఁబనులెన్ని జేయమన్నను జేయుచుంటిఁగాని నా శక్తికి మించుపనులెట్లు జేయుదును? ఈ చేటెఁడు ధాన్యమును పదినిమిషములలో దంచుమని తల్లి నాకాజ్ఞాపించెను. ఈ యల్పకాలములో నీ పనిని ముగింపఁగలనా?......ముగింపనిచో నాగతియేమి? (రోటిలో బోసి నాలుగు పోట్లువేయును) అబ్బా! ఎంతబాధ! ఎంతాయాసము! చిగురుటాకులఁగేరు నీ చిన్ని హస్తముల కెంతగతి దాపురించె!

శ్లో॥ అరయఁగనెన్నఁడు నెఱుఁగక
కరమందునరోఁకలుంచి • గ్రక్కున దంచన్

తరుణికరమ్ములు గ్రించెను
సురుచిరసుకుమార తనువు ♦ సొక్కెను మిగుల౯.

కటకటా ! ఈ రోఁకలెంత భారముగా నున్నది? (మరల రెండు పోటులేసి)

గీ. రోఁకలెత్తఁగ నంతయు ♦ రొప్పవుట్టె
చేయిపై కెత్తియొకపోటు ♦ వేయలేను
ధాన్యరాసులు తరుగంగ ♦ దంచలేను
సవతితల్లిగొట్టెడు వేళ ♦ సైపలేను. (రోఁకలిపడవైచును)

జనకుఁడింటనుండినేని నా కిన్ని కడగండ్లుబొరయవుగదా ? కొలఁది దిన ములలోనే తిరిగి వచ్చెదనని నాయనగారు నన్ను బుజ్జగించివెళ్లి రి కాని యింత కాలమైనను పురమున కరుగరైరి. వారు వెళ్లిన కార్యము శీఘ్రమే జరిగినగదా వారు వచ్చుట. జనకునకు కార్య ము గలసిరాకుండుటయు నా దురదృష్టమే.

గీ॥ కానికాలము వాటిల్లి ♦ ఘనులకైన
కార్యఫలము లెంతైనను ♦ గలసిరావు
చెడుగువేళలో మధురంబు ♦ చేదయగును
పసిఁడిముట్టంగ నదియును ♦ యినుకయగును.

పరాత్పరా ! దీనపోషకా! తల్లి నన్ను బాసిననాఁడే నన్నేల మఱచితివి.

ఆ॥ వె॥ తల్లిలేనిబిడ్డ ♦ ధాత్రికిసహితంబు
భారమనుచు బుధులు ♦ బలుకుచుండ,
మాత చనినవేళ ♦ మాన్యుఁడ ననుజంప
మఱచిపోయి యింక ♦ మనుపనేల ?

(దాసి సుందరి ప్రవేశించి)

సుం—రత్నమంజరీ ! గ్రిడ్లనిండ నీరు గ్రిక్కుకొని యేమో తలపో యుచున్నా వేమిటమ్మ ? నాయనగారింకను రాలేదనియా?

రత్న—సుందరీ ! తల్లిని గోల్పోయిన నావంటి మందభాగ్యుల కేడ్పు గాక సంతోషమెటులుండును ?

మం—అవునమ్మా పాపము; పసిబాలవైన నీపైని గసిబూని నీపినతల్లి నీచేత నిట్టి వెట్టిగొట్టములు జేయించుచు శ్రమముల పాలుజేయు చున్నది. అయ్యో! నిన్నటిదినము నీవీపున గొట్టిన దెబ్బకు నా కండ్లు గమలిపోయినవి. పాపము! కన్నమ్మ కడుపుగాలును. విన్నమ్మ వీపుగాలును.

రత్న—సుందరీ!

గీ॥ చేయరాని యూడిగములు ♦ జేయవచ్చు
మోయనలవిగాని బరువుల్ ♦ మోయవచ్చు
నెట్టకేలకుఁ బ్రాణంబు ♦ బెట్టవచ్చు
సవతితల్లిచే గృహబాధ ♦ సైపరాదు.

సుం—అమ్మా! అట్లనకుము. లోకమంతయు నిట్టి మారుదల్లులైన, జగము వర్తిల్లుటెట్లు? నేనును మారుదల్లిచేఁ బెంచబడితిగాని యిట్టి దుర్భరమైన బ్రతుకు నేననుభవింపలేదు. నా తోఁబుట్టువులు ముగ్గురిని దల్లి గతించినది మొదలు సవతితల్లి పాపమా కనకవల్లి యరచేతనిడుకొని గారాబముతో మమ్ముద్ధరించి, పుట్టినింటికి మెట్టినింటికి సత్కీర్తి ఘటియించెను గాని (దిక్కులు జూచుచు) యిట్టులే మమ్మా మాసవతితల్లి జూచినచో నేటిదినము నీదురవస్థకు సానుభూతిజూప నావశ్యమొదవకుండుగదా?

రత్న—సుందరీ! అట్టి సతీమతల్లి నీపాలిఁటి కల్పవల్లి నీకు సవతితల్లి యగుటచే నీజన్మము ధన్యమైనది. నేనెంత వెఱ్ఱిదానను. జగమున మారుబిడ్డలకెల్ల నావ్రాతయే యనుకొంటి.

మం—అమ్మా! పొఱఁబడకుము. సవతితల్లులందఱు దుష్టమతులనరాదు. ఇందులకు నిదర్శనము నాసవతితల్లినే పేర్కొందును.

సీ. క్రమశిక్షనింట స ♦ క్రమముగ నెలకొల్పి
మమ్ముల మనిపెగా ♦ మారుదల్లి
కోపతాపమ్ములు ♦ గొనకయే యేప్రొద్దు

మమ్ము౯ బ్రోచెగా ♦ మారుదల్లి
పోరువెట్టక నింట ♦ పొందు నెంతయుఁగోరి
మమ్ముల దిద్దెగా ♦ మారుదల్లి
తనయొడఁగావించు ♦ తప్పులు నన్నింటి
మన్నించి దయజూపె ♦ మారుదల్లి

గీ. మట్టుమర్యాదలన్నింటి ♦ గట్టునెఱపి
మదికినాటంగ గఱపెను ♦ మారుదల్లి
కన్నతల్లికంటె మిగుల ♦ గనికరించి
మమ్ములబ్రోచె నిజముగ నారా ♦ మారుదల్లి.

అమ్మా! నీసవతితల్లి యిందేవచ్చుచున్నది.

రత్న—వచ్చిన రానిమ్ము. ఏమిజేయుదుము? ఉదయమున లేచిన మొదలిప్పటి కఱువది చీవాట్లు ముప్పది కాలుతన్ను లయరెను. ఇప్పుడు మఱిరెండు చీవాట్లును మఱియొక కాలుతన్నును సిద్ధము.

(సమద ప్రవేశించి)

సమ—ఏమేసుందరీ! చూచి రమ్మన్న కాల్చి వచ్చెదు దానవుగా నున్నావు. రత్నమంజరిజేయు పని మునిసినదో లేదో కనుగొను మని పంపితే పాప మమ్మాయితో లోకాభిరామాయణము ము చ్చటించుచున్నావటే?

సుం.—(స్వ) ఓహో! ఉరుమురిమి మంగలివానిపైఁ బడినట్లయ్యె (ప్ర) అమ్మా! రత్నమంజరి అమవాస్యకు రోఁకలెత్తుటయుఁ బున్న మునకు రోఁకలిదించుటయు నుండగా నకాలములో బని ముగి యుటెట్లు?

సమ—ఏమే అమ్మాయి! రోఁకలెత్తి దంచలేని యబలవా? సుకుమారి వా? పొద్దుకుఁ బదిపర్యాయములు మెక్కిన తిండి బలమెచ్చట దాచితివే? ఏమి? పాపము! నంగవలెనటించెదవు (చెంపపైఁ గొట్టును.)

రత్న—తల్లీ ! మీరనినట్లబలనేగాని సుకుమారిని గాను. సుకుమారినై తినే నిన్నికష్టములేల ? అంతఃపుర సౌఖ్యముల నందకుందునా ?

సమ:—పాపముగదే ! నీముఖమున కంతఃపురసౌఖ్యమొక్కటేతక్కువ. (మూతిఁ బొడచును) సుందరీ ! చూచితివా ? అమ్మాయి గొంతెమ్మ కోర్కులకు కొండంత దేవర.

సుం:—(స్వ) ఇఁక నిచట నిలువరాదు. విడువుమన్న పామునకుఁగోపము. కరువుమన్నఁ గప్పకుఁగోపము. మెల్లఁగా నవతలికి ముఖముదప్పించిపోవుటే యుత్తమము.

(మెల్లఁగా నిష్క్రమించును.)

రత్న:—ఆ॥ వె॥ కోరలేదుతల్లి ! ♦ గొంతెమ్మకోర్కులఁ
జూరలాడలేదు ♦ సుఖముమదికి
దాస్యవృత్తి జేసి ♦ దయనపేక్షించెదు
నతివగోరదెపుడు ♦ యందళోములు.

సమ:—దాసీవృత్తితో బ్రతుకక నన్నేలుమేటివై యుండఁదలఁచితివఁటే ? నీతండ్రికడసాగినయూటపాటలు నాకడసాగింతువటే (మూతిబొడచును)

కీర్తన—సంవాదము—"దూరముగలెనుంబుమా" వలె

రత్న—సారెసారెకు గొట్టక నట - సరసముగాఁ జూడుమమ్మా-
విరసంబుతోడ - కసరకనన్నుఁ - గరుణఁజూపులఁ జూడుమింకా॥
నిరపరాధి - నిటులజూడ - దురితమ్మునీకుబొరయదా ?

సమ—నిరపరాధివనుచుమది - నెటులనీవు దలతువో - నోరు
నింకనుమూయవా ?

రత్న—వట్టినెపములెన్నక గాయవా ?

సమ—తరుణి ! నీదుశరీరముదునుమ - నతరయఁగనాకడ్డెవ్వరో.

రత్న—సారె సారె.

## ద్వి తీ యా ం క ము.

సమ—

సీ. కూఁకటివేళ్ళతో ♦ కొంపలుగూల్పంగఁ
బెద్దకాలమునుండి ♦ పెరిగినావు;
గయ్యాళిగంపవై ♦ కడుదీనురాలుగాఁ
బెద్దకాలమునుండి ♦ పెరిగినావు;
దయ్యాలదేవివై ♦ దాసివలెనటించి
పెద్దకాలమునుండి ♦ పెరిగినావు;
రాకాసిముండవై ♦ రత్నసానువుఁబోలి
పెద్దకాలమునుండి ♦ పెరిగినావు;

గీ॥ ఓసి! గోముఖవ్యాఘ్రిమ! ♦ పాసిపోఁక
భూరిసంపదల్ దిగమ్రింగఁ ♦ బుట్టినావు;
తండ్రికడముద్దుమూటలు ♦ దనరఁగట్టి
ముంచివైచితివేమమ్మ ♦ ముచ్చుముండ. (మొట్టును.)

రత్న—తల్లీ! దయావిహీనురాలవై నన్నింత బాధలుబెట్ట నా చేసిన దోషమెద్ది? నీయాజ్ఞను జవదాఁటి కలనైన ప్రతికూలముగా వర్తింపలేదుగదా? నా చేసిన గయ్యాళి చేష్టలేమి? రాకాసి ముండనై నేనెవరిని రక్కిపెట్టితి? నిష్కారణముగాఁ బదే పదే ననుఁగొట్ట నీకు చేతులెట్లాడునమ్మా!

సమ—

సీ. కుయ్యాడఁబోకుము ♦ కోసెద నీనాల్క
నాగడంపుపలుకుల్ ♦ సాగవమ్మె;
నీ యాటపాటలు ♦ నీతండ్రిజనునప్డు
చద్దిమూఁటలుగట్టఁ ♦ జాలవమ్మె;
నూరగాయకుమారు ♦ గారాబుచేష్టలఁ
గోరిమూఁటలుగట్టఁ ♦ గొంటతయమ్మె;
ముద్దుగొల్పెడు నీదు ♦ మఱిపంబులన్నియు
బెరుగుతాళింపుకుఁ ♦ దరుగులమ్మె:

గీ. నిన్నిచాలక జనకుండు ♦ చిన్నవోవఁ
బసిఁడిచిరునవ్వులన్నింటిని ♦ బరఁగఁజేర్చి
తండ్రితలపాదలోఁ జుట్ట ♦ దనివిఁదీర
నరిగె దేశాటనమని నీ ♦ వెఱుఁగవంటె?

(చంపపై గొట్టి నిష్క్రమించును.)

రత్న—(ఏడ్చుచు) అఖిలలోకము నఱచేత నిడుకొని ముఖదర్పమందు ప్రతిబింబము గాంచునటుల పాలించు పరాత్పరా! న్యాయా న్యాయములు నీకంటికి గోచరములుగాకున్నవిగదా?

(నిష్క్రమించును.)

## ద్వితీయ రంగము.

(దాసి గృహము.)

(రత్నమంజరి నీళ్ళబిందెను నెత్తిపై బెట్టుకొని ప్రవేశించుచు.)

కీర్తన. "ఆహా! ఎంతటిఘోర మరణంబిది" వలె

(పల్లవి) జనకా! దురవస్థలన్నియుఁ - గనజాలక - నే దూరదేశంబున జేరితివో॥ జనకా! ॥

1. జనకా! నీవుగతియించి - జననిబ్రతికియున్న - ఘనతరజన్మ నా కమరియుండునే ॥జనకా! ॥
2. బరువుల్ మోయలేక - శిరము కంపమెత్తె - తనువు కష్టములకు దాళదహాహా! ॥జనకా! ॥
3. కొండలవలె నీటి - కుండలుమోయఁగ - గుండెలదరి బలు - గండములాయె ॥జనకా! ॥ (బిందెనుదింపును.)

స్వార్థాపేక్షలో నెంత క్రూరత్వముగలదు? ఒక్క పసిబాల క్షేమార్థమై

జనకుఁడు గతియించి జననిబ్రతికియుండఁ గోరుచుంటిని.........
...............నాతలంపులో స్వార్థాపేక్షయేమి? ‘‘ఏనుగంత తండ్రి యుండుటకంటె నేకులబుట్టంత తల్లియుండుట’! శ్రోత్రియ స్కారమను నార్యోక్తి మదికి స్ఫురింప నిట్లంటిని. దైవమా! నన్నింత హీనస్థితికీడ్చితివి? పెక్కండ్ర దాసీజన పరివృతంబై సకలోపచారములు బడయవలసిన నేను నీబాధలలో నొకర్తుకైన దాసియగు సుందరినాశ్రయించి దోసిలొగ్గి సకలోపచారములచే నడుగులకు మడుగులొత్తవలసె:—

ఆ॥ వె॥ పులికడుపునబుట్టి ♦ బలిమియింతయులేక
మేఁకపిల్లరీతి ♦ మెలఁగవలసె;
కాలమహిమయిట్టి ♦ కడగండ్లుజూపట్టి
మార్చుచుండునెట్టి ♦ మనుజునైన

ఇంతదనుక శరీరబాధ యొకటే పీడించెను గాని యిప్పుడు మనోవికలత మెండయ్యె.

ఉ. ఊఱజెంది యీవెతల ♦ కోర్చుటె నావిధియన్చు నెప్పుడున్
వారక మారుదల్లికడ ♦ వాదములాడఁగ లేదికెంతయో
క్రూరపుజూపుఁ జూడ మదిఁ ♦ గోపమునుంతయు నొందకుంటి; నే
నేరముజేసినానొ కడు ♦ నీచపు దాసినిగొల్వ దైవమా!

వా॥ మఱచితి. మొన్నటిదినము “అమ్మా! దాసి యుండఁగ నిట్టి యూడిగంపు పనులు నాచేతఁ జేయించుటేల?” యని నేనడిగినందులకుఁ గదా దాసికి బానిసతనముఁజేయ నన్ను నియమించె. అదిగో! సుందరి యిదే వచ్చుచున్నది. క్షుద్బాధాపీడితమైన బెబ్బులిచందమున నాపైఁ బడి రక్కునేమోగదా?

కం॥ కొండలు చందముపైఁబడు
గండములెన్నియొ వెలార్పఁ ♦ గ్రిక్కునరాగన్
దండిదయామయుఁడీల నా
కండగనుండడె యనాధ ♦ నమరఁగ బ్రోవన్.

(సుందరి—ప్రవేశించును).

సుం—ఏమే రత్నమంజరీ ! యీాదినమింత యెండెక్కి నీళ్ళు దెల్చుచు న్నావు ? నాకుఁ దలస్నానములని నిన్ననే నీకుఁ జెప్పితిని. చెప్పి నమాట నీకు చెవిఁ దూరుటలేదేలనే? ఇంతవఱకుఁ గసవుజిమ్మక పోతివి. ఎప్పుడీ పనులన్నియుఁజేసి నీమొకమున మొద్దులార్చు కొందువు?

రత్న—అమ్మా ! చచ్చినదినము గదా ?

సుం—ఏమే నీ కండకావరము ! అమ్మ చచ్చినదినమా ? సరే. అమ్మ గారినే రానిమ్ము.

రత్న—అమ్మా ! పొరఁబడకుము. నేను చచ్చినదినమని, నా భావము.

రాగ-పూరి. కీర్తన (సంకాదము) చతురశ్రగతి-తాళము.

"నామదిగలయీా కోర్కెను"వలె.

భామరో నాదు - భావము - దెలియక - తామసమున నిటు - బలు కఁగదగునా? - ధీమతిమాత నా - సేమమేగోరఁగ - నేమని-దూషించి - యెగ్గులొనర్తు ॥భామ॥

సుం—దూలనాడి కడుం - బ్రోలకు నాకడ - నాలుకగోతును - చీలిక లుగా - బేలవలె పల్కు - లాలకించియు భావ - ములను గ్ర హింపని - ముగ్ధరాలనా?॥

రత్న—"భామరో"

రత్న—అమ్మా! పోనిమ్ము. మీారు తలంచినటులనే చేయసమకట్టుము. యజమాని దయారసముఁబొంద మీారెన్ని వృజనములు వడిగట్టు కొందురో కట్టుకొనుము.

సుం—ఛీ ! మాటాడక నోరుమూాయుము.

గీ॥ భయమొకి రవంతేయును లేక • వదరుదేని
రాణితోఁజెప్పి నిన్నుఁ జే • ద్పుఱతునిదిగో !

దాసిమాటాడవలసిన ♦ దారివేఱె
నీదు పొగలుకూతలు వేఱె ♦ వాదులేల ?

రత్న—అమ్మా ! గోటితో జిమ్మదానికి గొడ్డలేల ? నీకు దాసానుదాసినై యహోరాత్రములుగొల్చి నీకు నలయు నుపచారములన్నియు త్రికరణశుద్ధిగా నొనరించి తమయాజ్ఞ శిరసావహించు దానఁగదా ?

మం—ఓసి వయ్యారి ! ఎవరికొఱకుఁ జేయుదువు ? నీకొఱకా ? నాకొఱకా ? ఇంత జేసి తేనేకదా యొక పిండపుముద్ద వేయించునది.

రత్న—అమ్మా ! నాకొఱకే. అందు ముఖ్యముగాఁ బట్టెడుదరము కొఱకు.

మం—(స్వ) జేప్ ! నాదెబ్బకు రత్నమంజరి గడగడలాడుచున్నది. ఎట్లైననేమి ? చతుర్విధోపాయములు ప్రయోగించి రత్నమంజరిని దాసత్వమునకై గుత్తకుఁగైకొంటి. (ప్ర) మంజరీ ! కసవుఁజిమ్మి కళయంపిజల్లి ముగ్గులువెట్టి గృహము శృంగారించుము.

రత్న—(రత్నమంజరి యూడ్చుచు స్వ) దైవమా ! ఇఁక ముందు ముందు నాకెట్టిముప్పులున్నవోగదా ? నా సవతితల్లి కఠినముగా నన్నుఁ బరామర్శించువేళలోఁ దొల్లి యీసుందరి నాయందపరిమితసానుభూతిఁ జూపుచుండెడిది. అట్టి దాసియుఁ బదిడబ్బులకాసించి యజమాని యభిమానమునొంద నన్నెన్నెన్ని బాధలకీడ్వవలయునో నన్ని బాధల కీడ్చుచున్నది. దూది చులకన, తృణము చులకన, దుమ్ము చులకన, తల్లిలేనిబిడ్డ తగచులకనందురు.

(దాసి యటునిటుఁ బ్రచారముచేయుచు)

(స్వ) గీ॥ సార్వభౌముని పుత్రిక ♦ పరగనాకు
దాసి యగుబచే సుకుమార ♦ తనువుగంటి;
నౌర ! రాచకాంతలు నిత్య ♦ గారవమున
జూరలాడు సుఖాంబుధి ♦ జొచ్చగంటి.

కీర్తన—పార్సిమట్టు.

రత్న—

1. ఉండమా యీ - చండము దిగు - లొందబోకుమా।
మందభాగ్యులకు సుఖము పర - మందు గలదుగా॥

2. కంట నీరు కాలువలై యిట్లు - లింటబారఁగా।
మింటనేలెడు ప్రభువుజూచి - మిన్నకుండునే?॥

మం—(స్వ) ఆ॥ వె॥ రాజపుత్రి నాకు ♦ రమణీయదాసియై
నిరుపమానభంగి ♦ నెగడునటుల
సహనగుణముఁజూపి ♦ గృహము దిద్దగనేర్వ
పుణ్యవతిని నేనె ♦ పుడమిలోన.

రత్న—3. చిన్నికరమా! చీపురుపట్టి యిటు - చింతపడకుమా -కన్నా
రఁగాంచువాఁడు నిన్నుఁ - గనికరింపఁడే?

మం—ఓసి మంజరీ! నేను దేవిగారిని దర్శించి వచ్చెద. నాపడకగదిలోఁ బాదరక్షలున్నవి. "నీయాజ్ఞ శిరసావహింతును"ని గదా నీవు చెప్పినది. నా బాదరక్షలు ని శిరమున వహింతువో కరమున వహింతువో చూచెద. వాని నా గదిలోనికి గొనిరమ్ము. (నిష్క్రమించును).

(రత్నమంజరి పాదరక్షలు శిరముపై బెట్టుకొని)

రత్న— కీర్తన-"ఏమి యీభ్రాంతి నాకేమి"వలె.

1. ఈశ్వరసంకల్ప - మీవిధముగనుండ - నేమిఫలము నేఁజింతింప-
విశ్వమునంతటి - నేకరీతిని గనక - ప్రాణికొక్కవిధము - బూని నుదుటవ్రాయు ॥ఈశ్వ॥

2. ఓడలు బండ్లుగాఁ - బండ్లు నోడలుగాఁ - బరిమార్పగల్గిన యీశుం - డీడులేని కరుణ - నార్తులఁ గాపెంచ - గూఢముగ మధ్య - గోడవలెనిలుచు ॥ఈశ్వర॥ (నిష్క్రమించును).



## తృతీయరంగము.

---

(అంతఃపురము.)

(సముద పరివేశించి స్వగ) కుడిచిగూర్చుండ లేక సవతిపుత్రికతో నింత దీర్ఘపుఁ బోరువెట్టుకొని పలురీతులుగా హింసించినను నది మొండికట్టియవలె నిల్లు వదలకున్నది. నావెఱ్ఱి భ్రమలన్నియు ఆకాశమునఁ నిర్మించిన భవనములయ్యెను. రత్నమంజరిని సమూలముగా రూపుమాపినచో నానాథున కనంతర మీ సామ్రాజ్యము నేనే యేలవలయునని యువ్విళ్లూరుచుంటి. అందని మ్రానికెగ్గులు జాపినట్లాయె. నాకోర్కె వాంఛలన్నియు నేఁటితో నడుగంటి పోవలసివచ్చెను. ఇఁక నెలదినములలో భర్తగారు విచ్చేయుదురఁట. నాగావించిన యఖిలకృత్యములెల్లఁ దండ్రికి బూసగుచ్చినటుల రత్నమంజరి చెప్పకపోదు. ప్రస్తుతము మదికేమి దోఁపకున్నది. అదిగో! దాసిసుందరి యిందేవచ్చుచున్నది. రానిమ్ము దానితో నాలోచించెద.

(సుందరి—ప్రవేశించుచు స్వగ)

గీ. దాస్యవృత్తిలో నిరతంబు ♦ డగిలియుండు
నరునికెందైన మోక్షంబు ♦ దొరుకఁగలదె?
యుదరపోషణార్థము తన ♦ యధిపతికడఁ
బాడిదప్పి యనీతులు ♦ బలుకవలయు
హేయకార్యముల్ శిరమూని ♦ జేయవలయుఁ
జేయ నొల్లని వేళలో ♦ చేటుగల్గు.

ఆహా! నేనెంత దుర్మార్గురాలను! సముద మెప్పు వడయుటకై తా జెప్పుపనులన్నియు, యుక్తాయుక్త వివేచనలేక నొనరించుచుంటిని. దేవి నాకర్పించు ధనమునకు లొంగిగదా! పాపమా రత్నమంజరి నేస్పించి యెట్లామన్నుఁ, జేయుచున్నాను. దాసులం

డుఁ గాన్పించు కొద్ది దోషములను విచారించి తగుశిక్ష విధింప చక్రవర్తులు గలరుగాని, చక్రవర్తులందు దాగియుండు బందు దోషములను నివారింప నాబోఁటిదాసులకువీలగునే! రాజుదొంగయైన బంట్రోతు కన్నవు దొంగ గాక యుండునా? ఈవిషయమున దేవిగారి యభీష్టమెఱిఁగి ప్రవర్తించినగాని నాలుగు కాసులు చేతిలో పడవు. (సమీపించి ప్రకాశ) దేవిగారికి జోహారు జోహారు.

సమ—తథాస్తు సుందరీ! అటు కూర్చుండుము. వెనుకబోయిన తీగకాళ్ళకుఁ జుట్టుకొన్నట్లు నిన్ను బిలువనంప గోరువేళ నీవే వచ్చితివి.

సుం—అమ్మా! మీరెద్దియో దీర్ఘాలోచనలో మునిఁగియున్నట్లు దోచెడిని.

సమ—సుందరీ! ఇఁక మనగతియేమి? (లేఖనిచ్చును.)

సుం—(మనసులో జాబు చదువుకొని) అమ్మా! మీనాథుఁడిఁక నెల దినములకుఁ బురమున కరుగునని యిందు లిఖింపఁబడి యుండ మనగతికి వగవనేల?

సమ—ఓసి! నీవెంత ముగ్ధరాలవే?

ఉ. క్రోధముదాల్చి ఘోరముగఁ • గూఁకఁటివేళ్ళను బెల్లగింపనై
బాధలు బెట్టనేర్చితిమి • పాటనసేయక రత్నమంజరిన్
నాథుఁడు వచ్చెనేని యిఁక • నాకును నీకును జేటుగల్గదు
క్రొబ్ధలుజేసి నాసవతి • పుత్రిక కొంపలు గూల్పకుండునే?

సుం—నిక్కువమే. కనుక చేయు కార్యమెద్ది?

సమ—అగ్ని శేషమువలె శత్రుశేషమును భయంకరముగదా? రత్నమంజరిని తనతల్లికడకు రాయబారిగాఁ బంపుటే యిపుడు చేయు కార్యము.

సుం—ఇంత ఘోరకృత్యము నెట్లుచేయవలయును?

సమ—ఎట్లనా? చేతులతో.

సుం—బాగు బాగు. దేవిగారితో వ్యవహారమయిదు రెంటికిఁదక్కువ లేకున్నది.

సమ—అనఁగా ?

సుం—ఆరునొకటి కెక్కువగాదని భావము.

సమ—అట్లనఁగా ?

సుం—నాలుగు మూఁడింటికి సమానమని యర్థము.

సమ—సుందరీ ! గణితశాస్త్రమందుఁ జాల గట్టిదానవై యున్నావు.

సుం—అవును. దేవిగారికి శారీర శాస్త్రమందెంత నిపుణతగలదో గణితశాస్త్రమందును నాకంత నిపుణతగలదు. రత్నమంజరిని కడతేర్చి సార్వభౌమునితో నేమి చెప్పఁదలంచితివి ?

సమ—ఓసి సుందరీ! నీయసమాన పాండిత్యమున కెంతయు నచ్చెరువొందితి. అంకునేర్చి బొంకనేరని కుంకననితూ నీయభిప్రాయము ?

రా॥ కాపి కీర్తన- ఏకతాళము॥

1 బాలనా ? పసిబాలనా? - యేలనిటుల నడిగెదవో - వెఱ్ఱిదాన తోఁపదే - మేలుకీడు తెలియఁగనేర్చి - చాలకాలము బ్రతికినంత- వాలుగా నీకృత్యముదాప - పిలుకులు గని బేలనా? ॥ బాలనా॥

2 కుందకు ... భయమొందకు - మందగమననేఁ దలఁచు యుక్తి నొకటి విందునె - యెందు వెదకిన - సందియంబు - డెందమునకు దోపఁకుండ - ముందుగనె వెరవునెఱిఁగి - నాథునకెఱిఁగింతున్॥ ఆహా బాలనా॥

సుం—అయిన నిట్టి కృత్యముఁ గావింప మనమబలలముగదా?

సమ—మనమే దీనినేలఁ జేయవలయు:

సుం—మఱి యెవరు జేయుదురు ?

సమ—అర్థము సర్వార్థ ప్రయోజనమని వినవఁటె?

సమ—

గీ. ధనము గడుసు కార్యంబులఁ ♦ దరచుచుండు
ధనము దోషములన్నింటి ♦ దాచుచుండు
ధనము గురుతరఘనతకున్ ♦ దారిజూపు
ధనములో సర్వజగమెల్ల ♦ దాగియుండు.

కావున సుందరీ! నీవీకార్యమున కొడంబడుదువేని తెప్పపాటు కాలములో మనభటులైన అహమ్మద్‌ఖాన్, ఖుస్రూఖాన్ రత్నమంజరిని రూపుమాప సమర్థులు గదా ?

సుం—(స్వ)

గీ. దొడ్డనీతులు నేర్పిన ♦ దుష్టమతులు
పూని కీడొనరింపంగ ♦ మానరెపుడు;
పాలువోసి పెంచినయట్టి ♦ పామెకడకు
గరువకుండునె మనుజుని ♦ మఱచిమేలు.

కావున నిట్టి తరుణమందు దేవిగారికి నేను ధర్మమార్గ ముపదేశించినను బూడిదలోఁ బోసిన నెయ్యి చందమగును. కనుక దేవిగారికి నా యంగీకారముఁజూపి వీరైనంతమట్టుకు మఱికొంత ద్రవ్యము లాగుటయే యుచితము. (ప్ర) దేవీ ! రత్నమంజరిని దెగటార్చు భటులకెంత ద్రవ్యమీయనుద్దేశించుచున్నారు?

సమ—ఇప్పుడాప్రశంసయేల ? ఎంతద్రవ్యమైన నిచ్చెద.

సుం—కాదు కాదమ్మా ! చేతులారఁ జేసిన వారికే దోషముగాదు. దోషముఁ గావింప మనసంగీకారము జూపినవారికిఁగూడ దోషము జుట్టుకొనును. కాన భటులకిచ్చెడు ద్రవ్యములో నాకొక భాగము రావలయును.

సమ—సుందరీ! అందుకు సందేహమా? ఒక భాగముకాదు. నీకు మఱొక భాగ మధికముగా నిచ్చెద. భయమొందకు కాని రహస్యమును మాత్రము వెలిఁబుచ్చ నీయకుసుమీ !

సుం—అలాగుననేయమ్మా ! ఈవిషయము నాకొకరు చెప్పవలయునా ?

సమ—సుందరీ! సామిగానిని జేపో మాపో బిలువనంపుము.

సుం—ఇందు చాకల చినసామిగానితోఁ బనియేమి ?

సమ—ఓసి మందమతి! నీవంటి యజ్ఞానులే లోకమంతటనున్న నన్నృత మునకు నిలువఁ బాదములెక్కడివి ?

సుం—గ్రహింప లేకున్నానమ్మా !

సమ—ఇటురావె (చెలియొద్ద గుసగుస) చాకల చినసామిగానికి కొంత ద్రవ్యమిచ్చి మన సామ్రాజ్యము విడచిపోయి, యెంద్రైన బ్రదు కుమని చెప్పి పంపవలయును. నాధుఁడు వచ్చువేళ రత్నమంజరి చాకల చినసామిగానిని చేపట్టి యిల్లు విడచిపోయెనని నేను జె ప్పునప్పుడు నామాట నమ్మ వీలుండునటులఁ జేయవలదంటే ?

సుం—అమ్మా ? మీరెంతటి కార్యమునకైన నెఱజానవమ్మ.

(నిష్క్రమింతురు)



## చతుర్థరంగము.

---

(అరణ్యము.)

(అహమ్మద్ ఖాన్, ఖుసూ్రఖాన్ రత్నమంజరి నడవిలో లాగుచుందురు.)

రాగ—నీలాంబరి. తాళము—ఏకతాళము

కీర్తన—"సిలవిచ్చి మముబంపుము"వలె.

రత్న—1. అనఘ ! నను దయఁజూడవా ? - కానవా యీ బాధ।
కనుమూయులోల నింక - ననుబ్రోవనెవరు? ॥అనఘ!॥

2. కరుణాకర ! ననుదుష్టులు - నటుకుటచూడ।
నరుదెంచి ముప్పుఁబాపు - శరణని వేఁడ ॥అనఘ!॥

అహ—గడిబిడి కర్ నకో. జేగి ఆగే చోకరీ !

ఖు—తుమె తుమారె హమ్మతో లడాయి కై కురక్తీయా!

రత్న—3. నడవఁగఁ గాళ్లాడవు - బడలితిఁ గడుఁగ - దడవేల సేతు

వయ్యా? - నాదేవ! కనవా? ॥అనఘు!॥

అహ—హామ్మా? నీకిహిన్దా హేడ్సిసై క్యా ఫాయిదా? హన్దాలోయా. తో హమ్మకు కంటనీరు చొటుఖు, బొటుఖునపడేది.

ఖు—సైతాన్! మూమూచ్. క్యామెకు గడ్‌బడికర్తాహై? దేవి గార్కి హుఖుం హాంకుదియా. ఓ వాం శేయాకపోతే మాకు తంటా హో తాగే?

రత్న—నిష్కారణముగా నిరపరాధిని ఖండింప మీకుఁ జేతులెట్లాడు నాయనలారా!

ఖు—హోత్నేపైసా పత్తె చెయ్యి హూడ్కి హేమ్‌శాస్త్రది?

అహ—పైసా దిన్న దోసం పాపంశాస్త్రగా మాకిదోసం పోతుందిగే. తుమె అమ్మాపైసా దియాతో హమ్ము నీకి విడుస్తాం.

రత్న—తండ్రులారా! నాయొద్ద నేమియున్నదో మీ రెఱుఁగరా? మిమ్ము సంతసింపజేయుటకు నాయొద్ద మణిమయభూషణహారము లెవ్వియు లేవుగదా? మీకు నే నేమీయఁగలను?

ఖు—అరె అనామ్మద్! వాలుసె గ్యా బ్యాత్ లే? పొద్దు పోతుంది ఛే. దీన్కి అబ్ కైసా సంపాలె?

అ—అరె ఖుద్నూఖాన్. అది తుంకు మాలుం నై రే? ఏక్ లోటాసారాయి పియాతో బారా కూనిమాప్. హాంద్కి గాద్బ్యెదేవి అమ్మా దో సారాయిబుడ్లు దియా. అదెరె. ఏక్ బుడ్డి లేకో. పీరె (ఒకబుడ్డినిచ్చును. ఇద్దఱు సారాయి త్రాగుచుందురు.)

రత్న—(స్వ) సీ. ఎట్టిఖలమతినై ధర ♦ బుట్టినానొ
భూరిఘోరకృత్యములిట్లు ♦ బొందవలసెఁ;
కలుమగవాన దహనఁడీవె ♦ గానకున్న
నెవరుపాలించి బ్రోతురికి ♦ యువతి నింక?

ఖు—అరే! నీకి అల్లాకు ముక్తే అల్లా ఆకో మాకీ హేమ్ శాస్త్రాడ్? ఇదర్ ఆవురే. (లాగును.)

అ—అరె ఖుస్రూఖాన్! వైశానమేరే. హిట్లావంగబెట్టి ఏక్ మార్ మెడమీఁద కొట్టా, దో తునకల్ అన (లాగును.

రత్న—

గీ॥ కరుణయొక్కింతఁజూపక ♦ కాననమునఁ
బట్టిబంధించి ననుజంప ♦ ఫలితమేమి?
దండముల్ దండముల్ మీకు ♦ తండ్రులార!
విడువనెందేని బ్రతుకుదు ♦ వెతలువడుచు. (పాదములుబట్టును.)

ఖు—అరె అమ్మో యిది శానాశానా దణ్ణాల్ రక్తాహై. పాపం. దీణ్ణే చోడ్నారె.

అహ—అరె చల్ జే. దీణ్ణే చోడేతో మనం దేవికి క్యాబోల్నా? ఇది ఫిర్కు గర్కు ఆయాతో మన్కు పేనాలు పోవుబే?

రత్న—ప్రాణదాతలారా! నన్ను రక్షింతురేని నిందెచ్చటనైనఁజీవింతు గాని తిరుగ రాజ్యమునకరుగ నే నాశించుటలేదు. ఎట్లైనను రక్షించి పుణ్యము వడికట్టుకొనుఁడు మహాత్ములార!

అ—అరె హల్లాకాద్బె. నేను శస్త్రాన్. నుండేరి. దీన్కి ముక్కుశెవుల్ కాట్కో దేవికి తిఖాన.

ఖు—అరె అహమ్మద్! దీన్కి ముక్కుశెవుల్ కాస్తాగా, అమె, ఉశే మూ, దేఖేతో, పెద్దదయ్యంకిలాగ వుంటాది. హప్డు అమ్నా డర్ పుట్టాదుబే;

అ—అరె వైశానమేరే. ఉశేకండ్లు తీస్తాగాయిది కైసాజీతా? ఉశే పామనర్కితే యిది హెటుజాతానై. పాపంహిడ్తా పడిసా వాల్సింది. ఉశే, శేతుల్ నరికితే, హచ్చారతారె.

ఖు—అరేశేతుల్ నర్కితే పాపందీణ్కి శానా కైసాకాతారె?

అ—అరే! అద్మీకుహోతాహై. ముగాల్కిహోతానై. ముగాల్ కానా తిరంటా హలుంహ్లేద్బే. వైశాచ్చి. దీస్కి ముగాన్కి శేస్తాం.

ఖు—హాన్హా! నిల్ మొగ్గాడ్డివి. అల్లాసేయన్ దాన్కి తుమెకర్తాహై వైశాచ్చికరో.

(రత్నమంజరిని నిలువబెట్టి చేతులు ప్రక్కలకు చాపించి కత్తులెత్తి)

అ—అరే ఖుసూరి! ఏక్, దో, తీన్, అని బోలేతో ఏక్ దెబ్బాకు వృశేహోతా సర్కాలె.

ఖు—హాఁహ్హ! వైశాచ్చి.

రత్న—హా! జగదీశ! పథకు తేఁబడిన గొఱ్ఱెపిల్లనైతిగదా?

(ఏక్, దో, తీన్ అను చేతులు నఱికిరి)

రత్న—హా! దైవమా! దైవ.....(మూర్ఛిల్లును)

(నిష్క్రమింతురు.)





శ్రీరస్తు.

# రత్నమంజరి

## నాటకము.



### తృతీయాంకము—ప్రథమరంగము.



[శయనగృహము బుద్ధిసాగరుఁడు—ప్రవేశించుచు.]

కీర్తన—కాంతా! యీ యుగ్రవనం" వలె

1 తీరెనా మదినున్న - భారమంతయు నేఁడు - పురముఁ జేరువరకు నేఁ
జేరినంత - కూరిమి మీరఁగనా - కోర్కెలు సిద్ధింపఁ - గనులా
రఁ బుత్రికను గాంచనై - చరణ యుగము బిరబిరయిటు - పరు
గులిడగఁ బ్రేమలుదీర - నాలింగన ప్రాప్తికిఁ - దరుణ మొగవఁ
గా॥ తీరె॥

2 డెందము భాసురముగ నా - నంద మొందఁగానే నిఁక - పొం
దారఁగ భాషించియు హాయిగాఁ - గుందరదనతోఁ గూడి - సు
ఖము నొందు భాగ్యమొదవ - శృంగారమైన భవనమందగా॥
ఆ...తీరె॥

(స్వ) దీర్ఘకాలమునుండి గాంచని కతంబుచే మద్భవనంబు నూతన సౌందర్యముతో మది కలరారుటకు మాఱియది కళా విహీనమై నిర్జర వనప్రదేశమువలెఁ గన్పట్ట హేతువు దోఁపకున్నది. రత్నమంజరి ప్రసన్నతయు నంతఃపురమున వెలుగొందక యున్నట్టు దోఁచెడిని.

సీ॥ ఎదురేగి తండ్రితో ♦ ముదమార భాషించు
పుత్రిక నేఁడెందుఁ ♦ బోయెనొక్కొ!
దరహాస చంద్రికల్ ♦ గురిపించునగుమోము
భవనము న్విడియెందు ♦ బారెనొక్కొ!
కలకలారావముల్ ♦ చెలఁగి కూసెడు ముద్దు
చిలుకలేలకొ యిష్టు ♦ బలుకవయ్యె!
శారికాదులకంట ♦ నీరువెట్టి కడింది
దుఃఖింప హేతువు ♦ దోఁపదొక్కొ!

గీ॥ జనకురాకను దెలియంగ ♦ సంజ్ఞచేయు
కోకిలల్ నేఁడు ననుఁజూచి ♦ కూయవొక్కొ!
ముద్దుగాఁబల్కు జంతువుల్ ♦ ముఖవిలాస
ముడిగి మేడలోఁ దిరుగాఁడ ♦ దోడఁగవొక్కొ!

(అంతఃపురమునఁ బ్రవేశించి) ఉచితమేమి? రాపట్టి గాన్పింపక పోవుటయు, మోహనాంగి పరుండి మూల్గుటయు, నామదికి వెరపుఁ గొల్పుచున్నవి. కుమారీ! రత్నమంజరీ! ................. ప్రతిధ్వనులుదప్పఁ బ్రత్యుత్తరము. రాదయ్యె(నమదనుతట్టి) కాంతామణీ! కాంతామణీ! రత్నమంజరి ఎచట? రాపట్టి క్షేమమా?

[వ్యాధిగ్రస్తురాలువలె నభినయించుచు]

వమ—నాథా! నీళ్లు నీళ్లవంకనే బారుఁగాని మిట్టలెక్కి ప్రవహింపవు గదా? రత్నమంజరీ! రత్నమంజరీ యనుచు నేమేమో పలువరించుచుంటివిగాని మనోవ్యాధిచేత మంచమున పరుండి మూల్గుచున్న నాక్షేమమరసితిరా?

బుద్ధి—నారీమణి! నిష్ఠురోక్తులకిది తరుణముగాదు. నిన్నును విచారింతును. కుమారి యెందుగలదు?

సుమ—ఇల్లువెడలి యెచటకు బోయెనో యచ్చటనేఁగలదు.

బుద్ధి—రత్నమంజరి యెందుకు యిల్లువెడలెను?

సుమ—ఎందులకని చెప్పుదు? నేననరానిది. మీరువినరానిది. లోకులూ కనరానిది.

బుద్ధి—అతివా! అదేమో త్వరితముగా వచియింపుము.

సుమ—ఎలజవ్వనంబుతో నివ్వటిల్లు పువ్వుబోండ్లర్ధరాత్రివేళ నిల్లువిడచి యెందులకు పెళ్ళుదురో యందులకే. నీగారాబుపుత్రిక, నెయ్యంపుఁగూన, నీముద్దులపట్టి రత్నమంజరి వెడలిపోయె.

బుద్ధి—హా! ఏమిది! యిదికలయా! నిక్కువమా?

సుమ—ప్రాణేశ! యిది కలయనుటకు మార్గాయాసముచేత మైమఱచి నిద్రించుటలేదుగదా? ఇది ముమ్మాటికి నిక్కువమే.

బుద్ధి—ఆహా! రాకుమార్తెకు దుర్బుద్ధులుఁగఱపి నీచవృత్తి నడిపింప సాహసించు రాకుమారుఁడెవఁడు?

సుమ—నాధా! అట్టివాఁడు రాకుమారుఁడైన మీకీ పరాభవమేల? నాకీ శోకమేల? అన్నపానాదులుమాని వడగాడ్పుల కెండిపోవు తీఁగవంటి యీదేహమును కృశియింపఁజేసికొనుటకుఁ గులహీనుఁడైన చాకలసామిగానిని రత్నమంజరి చేపట్టుటచేతనేగదా?

బుద్ధి—

శా॥ ఛీ! మూఢాత్మ! దురాత్మ! యింతపనియా? ♦ చీకాకునొందన్ మహా
కామాపేక్షనుగూడి నాకొమరితన్ ♦ కామించిచేపట్టగన్
నీమంబన్నుమదిన్ దలంతువె ♦ యికన్ ♦ నీలావు నీలేగనన్
మాంసంబు మృగాలిమెక్క శిరమున్ ♦ నీచాత్మ! ఖండించెదన్

కీర్తన—"ఖలమతీ! నీదుగతి" వలె

ఖలుఁడవె - తులువవె - తలస్థునిమెదనురా - మదమున ని
టుసలిపితివహో! ॥ఖలుఁడ॥

కులమతలములు నీ - మనముననెంచక - కుటిలమానసత యి
టుచేసితివో హా - పిరికిపంద పగిదియెటుల -
నుతికినావో గనుముమూఢ ! - నరికెదనే - చీల్చెదనే
రుధిరము నే . గ్రోలెదనే ॥ఖులుఁడవె॥

నమ—(ఖడ్గముబట్టి) నాథా ! వలదు. వలదు. భీకరపరితాపమా చాకలి
వానిఁపై జేయనేల ?

గీ॥ ధీరునెదురొడ్డి ఘోరాజిఁ ♦ బోరునేని
జగతివానికి ఘనకీర్తి ♦ నెగడుగాని
పిఱికిపాల్దారివెన్నిచ్చి ♦ యుఱుకువానిఁ
జంపఁబోలదంచెఱుఁగువే ♦ సార్వభౌమ !

నమ దోషములను తాము నవరించుకొనులేక పరులదూరుట పాజ్ఞులకుఁ
దగదు.

గీ॥ మనదుపుత్రికగుణములు ♦ మంచివైన
పరులదుర్బోధలెట్టులఁ ♦ బట్టువడునో ?
కొలఁదినీరిడ క్షీరంబు ♦ గుణముబాసి
మారురూపంబునొందునే ♦ మానవేంద్ర !

బుద్ధి—ప్రేయసీ ? ఇంతటిపరాభవ మేసార్వభౌమునకు జేకురునని కల
నైనను దలంచి యెఱుఁగను. ఆహా ! దుర్భరము ! దుర్భరము!

నమ—ప్రాణేశ ! చేసిననేరమునకు తదుపరిగల్గు పశ్చాత్తాపము వలన
ఫలమేమి ? గారాబముతోఁ బుత్రికను బెంచినదానికిది ఫలమని
యెఱుఁగుము.

గీ॥ తప్పులొప్పులు దలఁపక ♦ తల్లిదండ్రి
మురిపమున బిడ్డలనుబెంచ ♦ ముప్పుగల్గు
మురిసిన మనదీపమనిశిఖ ♦ ముద్దిడుకొన
మూతిమీసముల్ గాలిన ♦ రీతియొప్పి

బుద్ధి—ఓసి గోముఖవ్యాఘ్రిమా ! పావనవంశాబ్ధికి విషముగలలవ నీవు

జన్మించితివా! కనులు కరవుదీర నినుగాంచు కుతూహలముచే విచ్చేసిన యీబుద్ధిసాగరుఁడేమిగాంచి సంతసించును? పిడుగువలె వీనులదాకిన యీదుర్వార్తవిని యానంద మగ్నమానసుఁడ నగు దునా?

సీ॥ పుత్రికక్షేమంబు ♦ పొందెదమినినిల్పి
భవనాభిముఖుఁడనై ♦ పరుగువెట్టి
కమ్మనినెమ్మోము ♦ దమ్మిఁజూడఁగగోరి
భవనాభిముఖుఁడనై ♦ పరుగువెట్టి
ఏతదాలింగనం ♦ బేసర్వమనుభ్రాంతి
భవనాభిముఖుఁడనై ♦ పరుగువెట్టి
కూఁతును ముద్దాడు ♦ కొనుభాగ్యమునకునై
భవనాభిముఖుఁడనై ♦ పరుగువెట్టి
గీ. యిన్నికోర్కులు మదిఁబొంగ ♦ యిల్లుసేర
ఎదఁదలదరెడు దుర్వార్త ♦ గడలుకొనుచు
వీనులకుసోకె; కుటిలాత్మ! ♦ వేశ్యవృత్తి
నాచరింగ నీకెట్లు ♦ దోఁచెనకట.

పద్మ— ప్రాణేశ! ఊరడిల్లుము. ఊరడిల్లుము. కడుపు జించుకొనిన ప్రేవులు కాళ్లపైఁ బడుఁగదా? పరాభవము మనకు గల్గినదని భయంపడకుము. ధీమంతురాలగు రత్నమంజరి యీకార్యము పరమరహస్యముగానే కావించెను.

బుద్ధి—ఇందువదన! సహింపఁ గడుదుస్సహమైన యీవార్తవిని యెట్లు యూఱడిల్లుదును! ఓసిరాక్షసీ! కులముజెఱుపఁ గుక్కమూతి పిందెలు బుట్టినన్నట్లు నావంశమున జన్మించితివటే?

చం॥ ఘనతరకీర్తిసీవలన ♦ గ్రక్కున రాఁగలదన్చునెంతయున్
మనముననెంచియుంటిగదె ♦ మాయనమారితనంబుగానకన్;
కనులకుఁగంపగొట్టి చెడు ♦ కార్యముబూనియుఁ బారినంతనే
నినుదునుమాడకుందునఁటె? ♦ నీచ! నితంబిని! దుష్టరాక్షసీ!

పమ.—ప్రాణవల్లభా!

గీ॥ మృక్కడిమృగాలి మృగరాజు ♦ లెక్కగొనక
మదపుటేనుగులను జంపు ♦ టదియెవిధము
శూరులగువారు భీరుల ♦ తోరణంబు
నలుపరవ్వారుసములతో ♦ సలుపుచుంద్రు.

నాథా! నామాటవినుము. స్త్రీహత్య మహాపాతకములలో నొకటియై యుండ నందు గర్భమున జనియించిన కూఁతును కరవాలమున కెరగాఁజేయ మనకుఁ దరతరములకా యుసురు దగులునుగదా? పోయినకుమార్తె పోనేపోయెను. ఇటుపరుండుము. శాంతింపుము శాంతింపుము. (పరుండబెట్టి) (స్వ) మాయోక్తిబూనిన నిటు లుండవలయును. నాథుఁడు నా మాటలెంత నిజముగా నమ్మి నాఁడు! దాసి యీరహస్యము మాత్రము వెలిబుచ్చకుండు నటుల దానికి మఱికొంత ద్రవ్యమిపుడే యిచ్చెద.

(నిష్క్రమించును)

---

తృతీయాంకము—ద్వితీయరంగము

[అరణ్యము—రత్నమంజరి ప్రవేశించుచు]

కీర్తన- "అయ్యయో న్యాయమా" వలె.

అయ్యయో దైవమా! ...............
ఈఘోరశిక్షనొంద - నీజగమునెంతపాపి-
నామేనిప్రాణమింక - నన్విడచిపోవె దేవా!
ఏలనీబ్రతుకు! - యేలనీతనువు పుడమిని ॥అయ్య॥

ఓజగన్నాయకా! ఈకష్టనాటకశాలయందుతన్నే ప్రధానపాత్రధారిణిగాఁ జేసి యింక ముందుముందు నావలన నెంతకథను జరుపవనమకటి యున్నావోకదా!

ఆ॥ వె॥ కన్నుదగులు పుడక ♦ గనిపెట్టిమెలగంగ
   శ్రేయమనుచు బుధులు ♦ చెప్పియుండ
   నశ్లిమదినిదలఁచి ♦ యతిజాగరూకత
   మెలఁగిబ్రదుకశ్రమము ♦ దొలఁగదయ్యె.

సర్వజీవాధార! ఈవ్యసనార్ణవమునుండి నన్నెప్పుడు దరిఁజేర్చెదవు?.........అదేమి! దూరమునఁ గడుభయంకరాకారుఁడై యమల కింకరునివలె నెవఁడో నావంక కరుదెంచుచున్నాఁడు. దైవమా! నేసేయునదేమి? ఈకాననసీమనాకాప్తబంధువు లెవరు?

సీ. ఘనులార! మునులార! ♦ వనపతులార! హా!
      రక్షింపగానన్ను ♦ రారెమీరు?
   కరులార! వనదేవ ♦ వరులార! చనుదెంచి
      కాపాడిపుణ్యంబు ♦ గట్టుకొనరె;
   భల్లూకశార్దూల ♦ భద్రగజములార!
      యరుదెంచి యొక్కింత ♦ నభయమిడరె;
   హరులార! కాంతార ♦ దరులార! గిరులార!
      పరుగిడియీయాపుప్పఁ ♦ బాపరారె;
   గీ. భూతపతులార! నన్నుగన్న ♦ దాతలార!
      శూరమతులార! రణరంగ ♦ శూరులార!
      కరుణజూచి యనాధను ♦ గావరారె
      పుణ్యవతులార! జగదేక ♦ ధన్యులార!

కటకటా! ఏమిసేయుదాన? కిరాతుఁడు సమీపించుచున్నాఁడు. ఆపొదరిండ్లలోనైన దాగెదఁగాక. (దాగును) (ఎటుకలపోలుగాడు ప్రవేశించును.)

పో—ఓసబ్బకూతరో! పొన్నంగిలాగ పొదలో దూరేవెందుకే. అహో సూడనక్కని దాన్ని దాగేవంటే. ఇదిగో! మరే మొట్టశాత్తా

వో! సిగ్గుపడ్డావంటె పిల్లో? సిక్కేవు. మతినాసామిరంగా యెట్టా శాత్తావో.

రత్న—[స్వ] అయ్యో! భక్తరక్షకా! ఈదుష్టుని బారి నుండి నన్ను తప్పించి యాపన్నరక్షకుఁడను బిరుదు సార్థకముఁజేసికొనుము.

(ప్ర) ఓయికిరాత! ఉమతకేల నూతిలోని వార్తయన్నట్లు నీదారి న నీవుపోక నాతోఁ బనియేమి?

పో—అబ్బో! పిల్లపనిశానాదాకున్నదే. ఈ అడివి మాతాతలే లేరు. మాతండ్రులేలేరు. యిపుడునే నేల్తుంటె నాకు బట్టనిపని మరోరికి పట్టాల? ఇదిగో! నాకెల్లిసూడు. నాసామిరంగా నీమంచు నామంచు యేకమైతే యిదిగో పెల్లిశేసుకోవలె.

రత్న—హా! దైవమా! ఎంతగతి దాపురించెను?

[ప్ర] ఆ॥ వె॥ సింహములకు గ్రాసు ♦ సింహములకుసఖ్య
మెలుగునయ్య ♦ మెచటనైన;
రాజవంశకన్య ♦ రాజిల్ల సుఖనిధి
బోయవానిగూడి ♦ పొసఁగలదె?

పో—ఓసి తాల్ తాలే! తాతకు దగ్గులునేర్పిస్తే యిడస్తాననుకోంటివా? ఇపుడు నాకోరడ్డమొత్తారో సూత్తాగా. అదైనా రాజుగోరికన్నెలు పెల్లిల్లుసేసుకోరుగామాల? బిడ్డలు పుట్టరుగామాల? అదైన సూత్తాగా.

రత్న—అయ్యో! నాతోవాగ్వాదమేల? దిక్కులేని వారితోఁ బరిహాసమాడ నీకెట్టున్యాయమయ్యె? (పోవుచుండ పోల (దడ్డగించుచు)

పో— కీర్తన. "చింతామాను చిలుకలార" వలె.

1. సందామామ వంటిదాన - సక్కని మొకముదాన - సందుజేసి మొందు నడతువే? - ఓభామ కాళ్లుసీకు - కందిపోలేదా?॥

2. పెల్లాణ్ణివదలుకుంట - పిల్లలను మానుకుంటా - పెల్లిచేసికుంటరా పిల్ల - ఓభామ! కన్నుయేస్తి నన్నుజూడవే.॥

వెం.—(తెరలో వెంకి)ఓరిపిల్లగా!మల్లీవత్తా.అక్కడ్నే వుండ్రో.మీఅబ్బ పోలుగాఁడు కల్లుతెత్తానని ముంతెత్తకపోయి యింకారాలేదు.తూచివత్తా. తాగి తందనాలాడ్తున్నాఁడేమో? ముండాకొడుకు.

తక్ష—కరములు ఖండింపఁబడి మొండికిలనైన నన్నుఁబోసికనడ్డువచ్చుటేల నాయనా? నన్ను వివాహామాడిన నీకేమిసుఖము దక్కును నాయనా? నాదారిన నన్నుఁ బోనిచ్చి పుణ్యముఁ గట్టుకొనుము తండ్రీ!

పో.—రా॥ పున్నాగ కీర్తన- తా॥ ఆట.

1. శేతులులేవని- శింతపడకుపిల్లా- శేతగానిపనులు- నేనేజూత్తాను॥
2. కూడొండిపెట్టుతాను - గుడ్డతికిపెటుతాను- దణ్ణాలుపెటుతాను- దాసుడనవుతాను॥
3. పిల్లజల్లలు మనకు - చల్లగబుటితేను - మల్లెమొగ్గలలోన మటి నిన్నుబెంచనా?॥
4. నీయప్పఎంకాను - శాకిరి శాత్తాది - మనసు నా మీఁదుంచు - నీకే మొక్కుతా॥

[వెంకి చీపురుకట్టతో ప్రవేశించును]

వెం.—(బాదుచు) ఓరబ్బో! నీకు నీముండకి నేనంట్రా శాకిరిశేసేది తాగి తందనాలాడ్త శతురువత్తా వా ముండకొడక!

పో.—తాల్తాలే యెంకే శకినమాల పెల్లిశేసికోబోతే చీపురుకట్తో గొట్రావ్.

వెం.—చీపురుతో గొట్టక దేనితో గొట్టాల ముండాకొడకా! [కొట్టును]

పో.— కీర్తన- "కావిలమ్మ! కలుగోలమ్మ" వలె.

కొట్టకు - తిట్టాకెనన్ను - కోర్కెలన్ని కొండెక్కిస్తాను - తిట్టకుండా సక్కని సయితికి - ఎట్టులసూస్కుంటవో?॥

వెం—సయితిని దెచ్చేదవఁటరా - చాలదా నన్నేలుకుంటె? - సరసమా-
నాతోడనింక - మూతిమీఁద మోదెదరా॥

(రత్నమంజరి ప్రక్కనిలచి)

పో—వంద దెబ్బలకు - కందున దేహము - సుందరితో సొగసుగానుంటే-
పొందుగామాకు - పెళ్లి చేసి- యందమైన జూడరాదా?॥

వెం—అది నీ పక్కలో నిలుసుంటే కాకిముక్కున దొండపండు గట్టిన
లాగున్నది. అది నీమొకాన్కి అగ్గిపెట్టినట్లువుంది. ఒక్కదాన్కి
పెట్టలేక యేడుస్తున్నావు. దీనికి యేమిపెట్తావు ముండాకొడకా!
(కొట్టును) ఓసి యెఱ్ఱమూతులదాన నాకొంపకు యెసురుబెట్టి నా
కాపరం యేసుకోడానికి నువ్వొక్కడనుంచి నాకు సయితలాగ వ
చ్చేవే? పోయె (రత్నమంజరిని కొట్టును)

రత్న—నాతల్లీ! నాప్రాణదాతవై రక్షించితివి. ఇదే పోవుచున్నాను.

(రత్న నిష్క్రమించును)

పో—ఓసి యెంకే! నానోట్లో దుమ్మెయ్యాలని వచ్చేవంటే? పట్టుమని
ఒకపూటైన దాన్తో కాపరం శెయ్యనియ్యాకపోతివిగదే.

వెం—కల్లుతెత్తానని వచ్చి వొల్లుతెలియక తాగికై పెక్కి కోపుకు దిరిగి
ముండకొడకా! శేతుకువడ్తా? (కొట్టును)

పో—పొద్దున్నే వేళ యిద్యాల యేముండ మొకము శూచానోగాని
చీపురు దెబ్బలతో నలుగాయె. పెళ్లకూతురు మెల్లఁగాదూసి
కొనె.

వెం—ఏమిరా! ఏమిశూశావు? శూశిన శూత మల్లీశుయ్యి. యేముండ
మొకము శూశావా? పొద్దున్నే లేసి నామొకము శూడక యిం
కా దేనిమొకము శూశావు? [కొట్టుచుండును]

పో—ఇశ్శోబ్బా! ఇశ్శోబ్బా! తాల్ తాలె. ఒల్లుమంటెక్కె నీకుమొ-
క్తాను. (నిష్క్రమించును)

వెం—ఇంటికి పదరా నీపని శప్తాను [నిష్క్రమించును]

## తృతీయాంకము—తృతీయగంగము.

[అరణ్యము—రత్నమంజరి ప్రవేశించుచు]

కీర్తన—"ఏమిజేతు దైవఘటన" వలె

అక్కటా! యీ కాననమున - దిక్కుజూపనెవరిఁక?
ఎచ్చోనేగి మనుదునింక - నేమిదోఁపదే - ఒక్కఁడైన పుణ్య
శీలుఁ - డిక్కడ గాన్పింపడే॥ అక్కటా! ॥

2 పావనాత్మ! భవవిదూర! - పాపభీతులరయువా? - భావమందు
నిన్నెనిల్పదోవఁ జూపరార॥ అక్కటా!॥

3 భక్తఫలప్రదాయకుండ! - భక్తజనపోషణ! - శక్తిజూపి యిడు
మల్బాపి - ముక్తినొసఁగరార॥ అక్కటా! ॥

దూరమునుండి కళకళనినాదములు వినఁబడుచున్నవి. మనుజులొకరితో నొకరు భాషించుకొనుచున్నట్లున్నది. మృగము లంబరవీథికెగసి భయముతో నీవైపునఁ బారుచున్నవి.

శ్యామ—(తెరలో)

ఉ. సందడిఁజేయఁ బోకుఁడిఁక ♦ సైన్యసమూహములార! యీదెసఁ
జిందరవందరై హరిణ ♦ జృంభణదిక్కులఁదారె భీతిచేఁ
బొందుగనొక్కచోట నవి ♦ పూరియధేచ్ఛగమేయునెమ్మదిన్
వందమృగంబుల దునిమి ♦ వచ్చెదమీరలు నిల్వుఁడిచ్చటన్.

రత్న—అదిగో! ఎవఁడో యొక యువకుఁడీదెన పొంచి పొంచి నడచుచున్నాఁడు. దయాసాంద్ర! కరుణాకర! ఇఁక నన్నెటుల దాచెదవో! ఈయనాథి నెటుల బ్రోచెదవో! ఆవృక్ష ప్రకాండము చాటున దాగెదఁగాక. (దాగును)

(శ్యామమోహనుఁడు నడచుచు తటాలున నిలచి)

శ్యా—(స్వ) ఏమీ చిత్రము! నిర్జనప్రదేశమున సంచరించు నీకన్నియ యెవరు? ఇందేల దిరుగుచున్నది.

## ర త్న మ ం జ రి.

కీ ర్తన—"ఎవ్వారివాఁడవో" వలె.

ఈ మోహనాంగి - యొంటిమై యిటు - దిరుగనేవతేమో।
నామధేయ మడుగఁదలఁచిన - తామసముఁజూపి పారిపోవునేమో॥

1. చూడఁగా నీమదవతిరాపట్టి - వేడుకలరఁగ భాషించువాఁడ।
యీడులేని సోయగంబు- కడునడిగా నా - కన్నులుగాంచె నే॥ ఈమో॥

2. అవనినీ యిందిరాక్షినిగ గూడ - భవలతలింకఁ - దొలంగిపోవుగ।
కువలయాక్షిని బలుకరింపఁ - బావనమార్గ మందగలను నేఁడే॥
॥ఈమోహ॥

ఈకన్నియ సౌందర్యము నిజముగా నాకన్నుల కరువుదీర్చె.

సీ. ముఖవిలాసముజూడ ♦ పూర్ణేందు బింబంబు
నలినమ్ములన నొప్పు ♦ నయనయుగము;
కాంచంగ నీయింతి ♦ కనుబొమలేవింట్లు
చూపులు వలరాజు ♦ తూపులగును;
అలివేణి పదములు ♦ కలహంస పదములు
మెఱుపుతీగెను గేరు ♦ మేల్మినడుము;
వదనంబు లక్ష్మికి ♦ సదనమై యొప్పారు
మూర్తీభవించిన ♦ ముద్దులగుమి;

గీ. అరయ నిది రాకొమరుల మో ♦ హంపుఁదిలక;
పసిఁడిబొమ్మ; మణులదండ; ♦ వలపుబంతి;
కోర్కులందఁగ విలసిల్లు ♦ కోమలాంగి
చూడ శృంగారదేవత ♦ సురలకైన

కలువకంటిని వలుకరించి చూచెదఁగాక. (ప్రి) యువతీమణి ? నీవెవతు
క్రూరమృగపరివృతంబైన నిర్జనవనంబునం దొంటిమై గ్రుమ్మర
హేతువేమి ?............ఓహో ! ఈ కనకాంగి లజ్జావనత?
వదనయగుటయేగాక కడుభీతిచేఁ గంపమొందుచున్నట్లు దోఁ
చెడిని.

ఆ॥ వె॥ అదరు బెదరుమాని ♦ యరుదెంచు మీావల
నతివభయమదేల ? ♦ నభయమిదిగో !
పడఁతి వినుము నీకుఁ ♦ బ్రీతికూల వచనముల్
వలుకననుము మఱియుఁ ♦ దలఁపననుము.

(రత్నమంజరి యీావలకరుదెంచి)

రత్న—మహాత్మా ! మీారెవరు ?

శ్యా—ఏను మణిస్తంభరాజ్యాధీశుఁడైన నమరసింహునిసి తనయుండ. నాపేరు శ్యామమోహనుఁడు. కనకాంగి ! నీవెవరు ? కరవిహీనురాలవై, వికలాంగివైన నీవృత్తాము కడుశోచనీయమని గ్రహింపవలసివచ్చె.

రత్న—(స్వ) మద్వృత్తాంతము వెలిఁబుచ్చుటచే భామరాజ్య సార్వభౌమునకు, మజ్జనకునకు, బుద్ధిసాగరునకు పరాభవము వాటిల్లక పోదు. కనుక నిజవృత్తాంతము దాచుట శ్రేయస్కరము. (ప్ర) మహానుభావ ! నా నామము రత్నమంజరియండ్రు. ప్రస్తుతము నీవు గాంచు దురవస్థ దైవసంకల్పము.

శ్యా—కోమలీ ! నీజననీజనకు లెవరు ? నీ కులగోత్రమెద్ది ?

రత్న—రాకుమారా ! కోపగింపకుము. ఈప్రశ్నమునకుఁ బ్రత్యుత్తర మీాయ నేనుద్యుక్తురాలనుగాను.

శ్యా—(స్వ) ఈపొలఁతి యెందుచేతనో తన వృత్తాంతముఁ జెప్ప శంకించుచున్నది. (ప్ర) నీవవివాహితురాలవుగదా ?

రత్న—రాజనందనుఁ డన్నట్లే.

శ్యా—ఇందువదన :

సీ. కన్నడసేసి నీ ♦ ఘనకీర్తి దిగనాడి
పాత్రినందిడు దివ్వె ♦ వైతివేల ?
తోడి కాంతలులేక ♦ కూడిమృగాళితో
వనదుర్గచంద్రిక ♦ వైతివేల ?

మోహనాకారుని ♦ ముంగిట వెలుఁగకే
యడుసు జేరెనరత్న ♦ మైతివేల ?
కళ్యాణి! సంతతిలేక ♦ గ్రిచ్చుఁబడయక
ఫలహీనమగు తరు ♦ వైతివేల ?

ఆ॥ వె॥ శ్రీమతి మదిలోనఁ ♦ జింతింపకుండిన
భావమదుగఁదలఁసు ♦ భక్తితోడ
కీరవాణి ! నిన్ను ♦ గోరితి పెండ్లాడ
నిచ్చగలైనేని ♦ నిమ్ము మాట.

రత్న— కీర్తన—"అయ్యా! మీకృపచే" వలె.

కరుణా భరణా! - సురచిరసౌఖ్యము - వఱలున మీకు నావలనన్?-
కరములులేని - తరుణిన్ గోనియున్ - పరిణయమాడఁగ ఫలమా?
॥కరు॥

భూరిసుభగతల నుబ్బతిల్లు నొక - నారీరత్నమున్ గోరుమయ్యా ? -
కడుసేమంబగు పుణ్యశీల ! (ప్రేర్) ఈ రమణిరూపు రేఖలు నీకో
ర్కులు దీర్పఁగలేవయ్య ! - కూరిమితో నను విడువంగఁ బుణ్య
మయ్యా ! । అకటా ! నేనొకవికలాంగినయ్యా - సకలావస్థలు
గూడుసయ్యా! - వీఁకతో మీకృపగనుఱుంకనను ॥కరుణా॥

ప్రాణనాథ ! మీబోఁటి రాకుమారులకు సేవలొనరించి, జన్మము
సాఫల్యము జేసికొను భాగ్యము వికలాంగినైన యీమంద
భాగ్యురాలు నోచుకొనలేదు. నాయనా! నాదారిన నన్నుఁబోని
చ్చి పుణ్యము వడిగట్టుకొనుము తండ్రీ !

శ్యా—నారీశిరోమణి! నిర్బంధ మేమియు లేదుగాని మువ్వూటి కిష్టప
డుదువేని నాయభీష్ట మీడేర్చి నన్ను ధన్యునిజేయుము.

రత్న మనోహరా !

శ్యా—(స్వ) "మనోహరా!" యని తరుణి నన్ను సంబోధింప నాప్రాణ
ము కుదుటఁ బడినది. నామనుగడయర్ధ భాగము బావనమయ్యె.

రత్న—మీరు నన్నుఁ బరిణయమాడ మీజననీ జనకులు సమ్మతింపని చో నాగతియేమి?

శ్యా—ఇందువదనా! ఇట్టి శంకలను మాత్రము నీమదిఁ జొరనీకుము. ఒకవేళ వారు సమ్మతించినను, సమ్మతింపకపోయిన నిదే నాప్రమాణము. అలకింపుము.

గీ. సూర్యచంద్రాదులార! యో ♦ సుమతులార!
తరువులార! నేలేలెడు ♦ తారలార!
పంచభూతములార! నా ♦ ప్రజ్ఞవినుఁడు
మగువరత్నమంజరి పట్టి ♦ మహిమపినాకు.

కుందరదనా! సందియము బాసెనా? నాయభిమతంబుఁ దీర్చుము. ముమ్మాటికి కంగీకరించుము.

రత్న—ప్రాణప్రియా! నీ కోర్కులు సిద్ధించుఁగాక

శ్యా—అటులైన రమ్ము. పురమున కరుగుదము. [నిష్క్రమింతురు]



## తృతీయాంకము:—చతుర్థరంగము.

[ భ వ న ము. ]

[నమరసింహుఁడు, శ్యామమోహనుఁడు ప్రవేశింతురు.]

నమ—కుమారా!

కీర్తన- "చింతిలకుము" వలె

మానవైతివి- నీమూర్ఖచిత్తమెందులకో॥ మాన॥

1. కానవమున దిక్కుమాలి - దీనవదన దిరుగుచుండ - పానుభూతిఁజూపికడకు - దానినివివాహమాడ॥ మాన॥

2. పలువిధముల నీతులెన్నో - పాపలకు నేర్పినటుల - చెలువుమీర గలపతేనయు! - ఫలములేక దక్కునటుల॥ మాన॥

తనయా! ఇప్పటికైన నీవు పట్టినపట్టు విడచినచో జగన్మోహిని యైన కన్యనన్వేషించి యచిరకాలములోనే పరిణయము సేయుదును. నీయభిమతమును మానుము.

శ్యా—రా కొమరులకిట్టి కోర్కులు ముమ్మాటికిని దగవు. ఏలననఁగా కళత్రమసమాన రూపవయోవిలాసిని యయ్యేనని నృపాలుఁడామె యతిమధురంబులగు మందహాస చంద్రికలకును, నతితరళంబగు కటాక్షమాలి కలకును వశుఁడై నిరంతర మామెతోఁ డిదే లోకముగా జరియించుచుండఁ బ్రజలకష్ట సుఖములారయు వారెవరు?

సమ—అటులైన కురూపియైన కన్యను వివాహ మాడ వలయు

శ్యా—జనకా! సకల సద్గుణమణియైన రత్నమంజరి కురూపియనియా నీభావము?

సమ—కరవిహీనురాలైన యీ వికలాంగిని వివాహమాడి యెట్టిసౌఖ్యములు వడయనెంచితివి?

శ్యా—జనకా! తరుశాఖలలో నొకటి రెండు ఖండింపఁబడినంతనే యా వృక్షము ఫలము నొసంగకుండునె?

సీ. నీలోత్పలముబోలు ♦ నా లలనామణి
కన్దోయిగాంచిన ♦ కలుషమడఁగు;
కోమలాధరబింబ ♦ రామణీయముఁగాంచ
భాగ్యంబుఁ గను మంద ♦ భాగ్యుఁడైన;
చిగురుటాకునుగేరు ♦ చెలువైన దేహంబు
నాలింగనమునొంద ♦ నలరు సుఖము;
పూర్ణేందుబింబంబు ♦ బురిడించు నగుమోము
ముద్దాడ ఖలుఁడైన ♦ మోక్షమందు;

గీ. పరిథవిల్లు సద్గుణపుంజ ♦ ♦ సరణి యయ్యు
మోహ మీడేర్చెడు త్రిలోక ♦ మోహనాంగి
చారు రత్నాలమూట బం ♦ గారుబొమ్మ
పుణ్యమతి జగన్మోహిని ♦ పువ్వుఁబోఁడి.

సమ—(స) కుమారుని హృదయక్షేత్రమందీ కన్యపై మోహంపుబీజములు మొలకలెత్తుటయేగాక దృఢముగా వేరులు నాఁటిపోయె. ఇఁక వీని మతి మరలించుట కష్టతరము. (ప్రె) కుమారా! పోనిమ్ము. ఆకన్య కులగోత్రములెవ్వి?

శ్యా—నాయనా! కులగోత్రములతోఁ బనియేమి?

సమ—కులగోత్రములు విచారింపకయే వివాహము లెట్లు జరుపుదురు?

శ్యా—సీ. కులగోత్రముల నెంచ ♦ వలయునె, వరునకుఁ
గుల ముద్ధరించునె ♦ గుణముగాక;
భాగ్యభోగము లెంచఁ ♦ బాడియే వరునకు
భాగ్యంబు బ్రోచునే ♦ భార్యగాక;
సౌందర్య మెన్నంగ ♦ జన్నె యెప్పటికైన
సుదతి ప్రేమామృత ♦ సుఖమెగాక;
ధనధాన్యముల నెంచ ♦ ధర్మంబె వరునకు
ధనము గానాడునె ♦ దారగాక;

గీ. భర్త కన్నికాలములందు ♦ భాసురముగ
నీఁడులేని సమ్మోదంబు ♦ నిచ్చునట్టి
భూరి వినయవివేక వా ♦ గ్భూషణములు
వరుఁడు గణుతింపఁ దగునయ్య ♦ వధువునందు.

సమ—(స్వ) తాతకు దగ్గులునేర్పు వీనితో నా వాగ్వాదమెటుల జయమొందు? (ప్రె) తనయా! ఆకన్య జననీజనకు లెవరు?

శ్యా—అదియును నే నెఱుంగను.

సమ—ఏమి యెఱుంగకనే యీ నీతులు హృదయమందు నెలకొల్పి, దిక్కుదెసమాలిన యొకకన్య కరమెటులఁ బట్టఁదలంచితివి?

శ్యా—గీ. ఎట జనించిననేమి వా ♦ హినిజనోల
యోగమునకెప్డు పరుగెత్తు ♦ చుండుగాదె?
సత్పురుషు డెవ్వఁడెటనున్న ♦ స్వప్రకాశ
మును మఱుఁగుబెట్టినను బైకెఁ ♦ బొంగకున్నె?

సమత—

చ. తలఁచగ నీసునీతులిల ♦ తథ్యములైనను రాకుమారుఁడే
కులపతి దెచ్చువేళకు ల ♦ గోత్రము పాటన సేయకుండినన్
చులకన సేయరే ప్రజలు ♦ సూక్ష్మగతిన్; మతిమార్గమెద్దిమో
సలుపఁగ దెల్పి నందియముఁ ♦ జయ్యనబాపుము రాజనందనా!

శ్యా—తండ్రి! ధర్మాధర్మము లెఱిఁగిన మీకు నేఁ జెప్పునదేమున్నది? బాగోగులు గ్రహించిన పిదపఁ బ్రజలకు భయపడి యుచితాలోచనములు కార్యరూపమున జరిగింపని చో సంఘసంస్కరణము లెట్లు బాగుపడును?

రా॥ బేహాగ్—కీర్తన—తాళ-ఆది.

సందేహమొందఁబోకుమా - ఓసాధుచరిత! ॥

1 కుందరదనకరముఁబట్ట - డెందమలరఁబూనెదను - పొందు
గసుముహూర్తమరసి - పరిణయంబుఁగూర్ప జనక॥ సందే॥

2 మాటికిముమ్మాటికి - బోటిచే నాపట్టమహిషి - దీటు
గముజ్జగము లెఱుఁగ - దివ్యముగను బెండ్లిఁజేయ॥ సందే॥

సమర—కుమారా! నీయభీష్టమే సిద్ధించుఁగాక, సుముహూర్తము నిశ్చయింప నార్యులతో నాలోచించి వివాహ సన్నాహములు గావించెదమురమ్ము.

(పురవీధిలో వెట్టివీరఁడు)

ఈటముక్కవల్ల అందఱికి చెప్పేది వినండో హోహో! ఇదిగో! చెప్ప లేదనేరు. శేయలేదనేరు. నాకొంపదీసేరు. నేలగట్టేరు నోటికాడ జీవనానికి మొసురుబెట్టేరు. రాజుగారితో గూడినమాట.

నాకుమాట దెచ్చేరు. ఈటమ్మువల్ల పిల్లోల్లకి, పెద్దోల్లకి, వయిసోల్లకి, ముసలోల్లకి చెప్పేదేమంటే యింక మూండు దినాల్లకి మనశాంసమో వనరాజుగోరు పెల్లిసేసుకుంటారంట. అందరు సంతోసించాల. యిండ్లు వాకిల్లు అలికి ముగ్గులుబెట్టాల. పురయిదులు అలంకరించాల. అందరు పరిసుబ్రి వస్త్రాలు వేసుకోవలె. ఉచ్చానికి అందరు రావలెహో (తిరిగి అదే చెప్పి)

(నిష్క్రమించును.)






# నాటకము.



## చతుర్థాంకము—ప్రథమరంగము.

### అంతఃపురము.

(రత్నమంజరి ప్రవేశించి స్వ॥) నిన్నటినుండి ప్రాణనాథుఁడు కడు దుఃఖాక్రాంతుఁడై తనలోఁ దానెద్దియో తలపోయుచుండు. రాత్రి నన్నుఁజూచి కన్నీరువెట్టి యెద్దియో నుడువ నుద్యుక్తుఁడై తుదకావిషయము వెలిఁబుచ్చకయే వెడలిపోయె. ప్రియుఁడు నన్ను వివాహమాడ సమకట్టు నప్పుడా వియ్యంబు నొల్లని తన బంధు మిత్రాదులు తననేమైన దూఱియుందురా?

... ... ... ... ... ...

నాథుఁడిదే వచ్చుచున్నాఁడు. రానిమ్ము. ప్రాణేశు మ్రోల నిలిచి దుఃఖమునకుఁ గారణ మరయుదునుగాక.

(శ్యామ మోహనుఁడు ప్రవేశించును.)

రత్న—నాథా! నమస్కృతులు.

శ్యా—తథాస్తు.

రత్న— కీర్తన "తగునా యిదిజనకా!" వలె.

మదిఁగుందఁగ దగునా? - కతముఁదెలుప - కిటులనాథ! ॥
ముదమారఁగ - ననుదినంబు - నతివనెంతొ నాదరించుచు॥మది॥

1 పదపడి యీతరుణినేలఁగ - ప్రాణనాథ! యలుకా?- యేవిధముదీ
ని - విడువవలయు - నని దలఁతువనాతిలకా! - నీహృదయ పల
కమునకు నెనరు - కుదురుగనిఁకబెలుకా? - సదయుఁడా నానేర
మేమో - స్వాంతమునఁ దాచకబలుకు॥ మది॥

2 పరులుడు కీసల్పినారా ? - పరగఁదూలనాడిరా? - అరయఁగనీహి
తులులో - కాంతగతులైనారా? - కారణంబుదెలయకున్నదె -
కాంతమదినిగోర - నీసరసోక్తులనిపుడేనా - సంశయముబాపు
ధీర॥ మది॥

శ్యా—ప్రాణనాయకీ! కొరమాలిన శంకలు మనము నందిడుకొని కృశి
యింపఁబోకుము. మనకు వివాహమయి యిప్పటికెనిమిది మాస
ములేగదా ? మోదములో ఖేదమన్నట్లు.........

రత్న—హా! ప్రాణేశ! మోదములో ఖేదమా? మీ కేమి విపత్తు సంభ
వించెను ?

శ్యా—ఈకొలఁది కాలములోనె నిను వి...డ...చి

రత్న—హా ! నాథా! నాథా! నన్ను విడచి యెందుఁబోయెదవు: ఏల
పోయెదవు !

శ్యా—దూరదేశము ! అందు యుద్ధమున్నకె.

రత్న—కటకటా! పిడుగువోలి లీనులుదహించు వార్త నుడువ నీకెట్లునో
రాడెనాథా ! ఒకటికి మూరు రెండు ప్రాణములుగల యీ కాం
తనిండె విడచి యుద్ధమున కరుదెంచ నీకెట్లు బుద్ధిపుట్టె? ప్రి
యా! యుద్ధ మెవరితో?ఇప్పటికి సంధి యొనరించుకొనఁగూడదా?

శ్యా—నారీతిలకమా! యుద్ధము మనదికాదు. సామంతరాజగు మజ్జన కుండు యేలేటి నారులక్షల రూప్యముల నెవరికిఁ గప్పముఁ గట్టునో యట్టి భామ సార్వభౌమునకుఁ గడు నిక్కట్టులు సంప్రాప్తమాయెనఁట. టర్కీసుల్తాను సైన్యము నలుఁవైపుల దేశమం నావరించెనఁట.

రత్న—ఏమి! భామసార్వభౌముఁడైన బుద్ధిసాగరునకా? అయ్యో! మ్లేచ్ఛుల సైన్యములచే నామహానీయుని రాజ్యము ముట్టడింపఁ బడియెనా? ఎంత ఘోరము! ఎంత దుర్భరము'

శ్యా—అతివా! భామసార్వభౌమునకు విపత్తునటలోఁ గడుఁగుందుచు న్నావు. కారణమేమి?

రత్న—కాదు కాదు. పాపమాసార్వభౌముఁడు సర్వప్రజానురంజకుఁడై సకల సామ్రాజ్య శ్రీయోభిలాషియై యుండుటంబట్టిగాదె సకల సామంతులుప్రజలు హాయిగా రొమ్ముపైఁ జేతులువైచుకొని ని దురించుచున్నారు. నాధా! సార్వభౌముఁడు తమ్ముయుద్ధమునకు సైన్యమునుగొని రమ్మని మీకు రాయబారమంపెనా?

శ్యా—చక్రవర్తికి యుద్ధమందు మజ్జనకుండు సహాయమొసరింపవలయు నని దూతచే రాయబారమంపఁబడెను. కాన.

గీ. ముసలితనముచే జనకుండు ♦ మూల్గుచుండి
యుద్ధభూముల కరుదెంచ ♦ సిద్ధపడఁగ
నతని వలదని యెంతయో ♦ మతులు విఱచి
యేన రణరంగమున నిల్వ ♦ నేగుదెంతు.

రత్న—ప్రాణప్రియా! ప్రసవదినములలో ననువీడి పోవఁ గాల్లాడెనా?

శ్యా—యువతీమణి! కాల్లాడకున్నను పోకతీరదు. పితృభక్తి, ప్రభుభక్తి రెండును నేకూరునటులఁ బోయితీరెద.

కీర్తన «మాటాడలేమే సఖి” వలె.

దిగులొందబోకు మిటు - ఓయింతి! - వలపులబంతి!

అగణితవైరుల - దెగటార్చు రణమున - జగదేక
యశస్సు - నెగడుదినములలో॥ దిగు॥

1 నీరజాక్షి ! నీవు - నీళ్లాడు తరుణమున - దూరమేవిలేని - దూ
రకుమదిలో॥ దిగు॥

2 శుభములారయు నాదు - ప్రభుసేవ నొనరింప - విభవమొందఁగ
మనకు - విజయమే గూడు॥ దిగు॥

కళ్యా—(స్వ) ఆహా ! అడవి యుసిరికకాయకు సముద్ర లవణమునకు ఏక పాత్రయందె సఖ్యమొదవినటుల మామ లల్లుండ్రకు రణరంగమందు సఖ్యమొదవెఁగాబోలు. (ప్ర) నాథా !

గీ. మూషికమును గాంచెడు వేళ ♦ మూతికడిన
పాలుమఱచి మార్జాలము ♦ బారునటుల
రణము పొసగంగనెందేని ♦ రాకుమరులు
వలపు గోలుపు నింతులనైన ♦ వదలుచుంద్రు.

మాయభీష్టము మాన్పఁజాల. మీకు జయము చేకూరుఁగాక. వెళ్ళిర
మ్మన్న. (నిష్క్రమింతురు.)

---

## చతుర్థాంకము—ద్వితీయరంగము.

---

(సమద ప్రవేశించును. భటుఁడు ప్రవేశించి)

భటు—అమ్మా ! ఎవరో యొకఁడు తమ దర్శనార్థమై ద్వారముకడ వేచి యున్నాఁడు. సెలవైనఁ గొనివచ్చెద.

సమ—సెలవు. వానినిటఁ బ్రవేశపెట్టుము.

భటు—చిత్తము (భటుఁడు బుడ్డసాహెబును ప్రవేశపెట్టును)

బుడ్డె—దేవిగార్కి సలాంఖర్తుం.

సమ—నీవెవరు ? ఎందు నిమిత్త మరుదెంచితివి ?

బుడ్డె—హామ్మా ! అమరెనాం బుడ్డెసాహెబ్. మారాజుగారు హాం డ్లేదూ ? ఆయన సమరసిమ్ములుహాుండ్లేదూ ? హార్ధమణి స్తంభరా జ్యములో ఆయన బేటూహాుండ్లేదూ ? శ్యామమోహాన్ రా హాయన్కి హాయ్యగారు హుతర్ం యిచ్చి పంపేరూ. ఆయన హెూక్దావున్నాది బోలేతో నాకీ హుతర్ం దేతుం.

సమ—అచ్చట వార్తలేమి ? మీరాజ్యములో నల్లకల్లోలము లేమైన నున్నవా !

బుడ్డె—ఏమి గడిబిడి నై హామ్మా ! అచ్ఛాసాబ్ హచ్ఛాహై. మాచిం డాగ్రిజ్ ఔరత్ హాుండ్లేదూ రత్నమంజరికి! ఆమ్కిదో మరద్ బచ్చాయిూనింది.

సమ—ఏమి ! రత్నమంజరియా ? ఆమె యెవరికుమార్తె ?

బుడ్డె—అది హాంకుమాలింనై హామ్మా ! చిండాగ్రిజ్‌కుహాుండ్లేదూ శ్యామమోహాన్ ? హాయున్కి జంగిల్కి షికారుజా కోవునేపకల్లె కాయ.

సమ—(స్వ) అహో్య ! తానొకటి దలంచిన దైవమొకటి దలంచుననూ టెంత యథార్థము! అడవిలోఁ జంపినామనిగదా భటులు నాకుఁ జెప్పినది. తనరెండు హాస్తములు గూడా నిదర్శనముగా నాకుఁ జూపిరి. (ప్ర) బుడ్డెసాహెబ్ ! మీరాణియే యీజాబు వ్రాసి పంపెనా ?

బుడ్డె—నై నై హామ్మా ! ఆమ్కిపాపం కుంటిదిఖద్దూ ? హాతాదోనైం.

సమ—(స్వ) హా ! తురకభటు లెంత మోసము జేసిరి! దానిని జంపక కరము లు మాత్రము ఖండించి నాకుఁ జూపి చంపితిమనిరి. ఇప్పటికై ననేమి ? మేనిజీవములున్నంత దనుక దానిని సాధింపక విడువ రాదు. (ప్ర) బుడ్డెసాహెబ్ ! చాలా సంతోషకరమైనవార్త

వింటిని. మీరాజుగారిపురమున కుత్తరదిక్కున నిరువది మైళ్ళ దూరములో రణ రంగమందున్నారు. అక్కడనుండి నీవు తిరిగి వెళ్లునపుడు నాయొద్దకు వచ్చి పొమ్ము. నీకు మంచి బహుమతి నిచ్చెద.

బుద్ధి—హచ్చాహాయ్.

సమ—గట్టిగా వచ్చెదవా ?

బుద్ధి—గట్టిగా హాతుం హంనా బడాయినాం రియాతో మే మొం దుక్కారాం ?

సమ—నిజముగా రావలయునుసుమీ ! గొప్ప బహుమతి.

బుద్ధి—వై సాచ్చి ! హాతుం. మీాకీసలాం. (నిష్క్రమించును)

సమ—(స్వ) అయ్యో ! సలామనసేమి ? నా వ్రాత యీలాగున్నదనఁగా నావ్రాతయు నీలాగున్నదని గదా భావము ? వీఁడు తిరిగి వచ్చునపుడు మత్తుగొల్ప మధుపానమిడి శ్యామమోహనుఁడు వంపు జాబును మాయముచేసి తగిన పన్నాగము బూనెద.

(నిష్క్రమించును.)

---

## చతుర్థాంకము—తృతీయరంగము.

---

(బుద్ధి సాగరుఁడు—శ్యామమోహనుఁడు రణరంగమున నిలచి)

శ్యా—(బిగ్గఱగా) వీరులారా ! వెనుకంజవేయకుఁడు. దేశభక్తి ప్రభుభక్తి నలకొల్ప మీా మీాభుజాపటుత్వములు చూపుఁడు. మీా ప్రాణములు దేశమునకై సమర్పింపుఁడు. మ్లేచ్ఛుల సైన్యములఁ బారదోలుఁడు. మేనఁ బ్రాణమున్నంతదనుక శత్రువునకు వెన్నిచ్చి పారవలదు. పోరుఁడు పోరుఁడు. ప్రాణములపై నాశవిడిచి పోరుఁడు.

బుద్ధి—

శా. శూరాగ్రేసరులార! మీబలములన్ • జూపంగ కాలంబిదే
వీరావేశముతోడఁ జంపుఁడరులన్ • విశ్వప్రకాశంబుగా
హోరాహోరిగఁ ద్రిప్పి ఖడ్గవితతిన్ • హుంకారనాదంబుతోఁ
బోరాడన్ జయలక్ష్మిఁగూడు నిపుడే • భూనాథుఁ డీక్షింపఁగన్.

శ్యా—ప్రభూత్తమ! మ్లేచ్ఛుల సైన్యములు మనసైన్యముల నెట్లు దరుముచున్నవో చూడుము. అయ్యయ్యో! మనసైన్యముల లో వేలకొలఁది యోధులు నిహతులగుచున్నారు. మనసైన్యములు శత్రులఁబారికిఁ దాళలేక వెన్నిచ్చి పారిపోనుంకించుచున్నవి. ఇఁక సేయునదేమి?

(ఆకాశమున దేవదూత నిలుచును. శ్యామ-బుద్ధి-నివ్వెరపడి మోకాళ్లూనుదురు)

దే-దూ—శ్యామమోహనా! శ్యామమోహనా! నీకిదే శుభవార్త వినుము.

కీర్తన - పార్శిమట్లు "జాగేల" వలె

భయమునొందకుము - నీవింకజయము కన్నుల గాంతువునేఁడు

1. రయముగా సైన్యములు నడుపుము - ముందుకు - భయకంపితులై వైరులింతటఁ - బారిపోదురే నమ్ముమింక॥భయం॥

2. భక్తితోడపోరు సల్పుమీదినమున - రక్తధారలొలుకరిపులు - రణమునందుఁగూలుదురే॥భయ॥

శ్యామమోహనయువరాజా! నీవు యుద్ధరంగమునఁ జొచ్చినదిమొదలు నీభార్య యింటనను దినంబు నీజయమునకై భక్తితోఁ బ్రార్థింపనట్టి ప్రార్థనఫలితమే యీఖడ్గము. నీచేత నున్న కరవాలము విడచి దీనిఁ గైకొని రణరంగమునఁ జొరుము. ఆఁకలి గొనిన కొ

దమసింగమును జూచి మృగములు పారుపగిది శత్రువులు పలా
యతులగుదురు. నీకు జయము సిద్ధించుఁగాక.

(శ్యామమోహనుఁడు ఖడ్గము దీసికొనుచు)

శ్యా—మహాత్మా! నమస్కృతులు.

దే-దూ—తథాస్తు. జయోస్తు (దే-దూత నిష్క్రమించును)

బుద్ధి—రణరంగమునఁ బ్రత్యక్షముగా దేవదూత మనకు సహాయము
నరించు టెంతచిత్రమెంతచిత్రము! నీభార్య భక్తివిశ్వాస ప్రార్థ
నముల మహాత్మ్యమేమి!

శ్యా—దేవా! చూచితిరా దెస? ఖడ్గము నాకరమూని నంతనే మ్లేచ్ఛుల
సైన్యములు పిరికిపంతలవలెనా నా దెసలకురుకుచున్నవి చూచు
చయు చూడుము.

బుద్ధి—నిజము. నిజము. భామసామ్రాజ్య యోధులారా! శత్రువుల
వెంటాడుఁడు. వెంటాడుఁడు. విడువకుఁడు.

(శ్యామమోహనుఁడు కత్తిద్రిప్పుచు)

శా. ఓరోరీ! కలుషాత్ములార! మము మీ • రోడించవనెంతెంతయో
పోరాడన్, సమకట్టినేఁడె యమరుల్ • భూషింపజకాఁడుదుర్
వీరాలాపములాడి భీరులవలెన్ • వేగంబబోనొల్లకన్
రా రే యింతటికోర్తు రేని శిరముల్ • రాలంగకయ్యంబునన్.

బుద్ధి—పారిపోవు పిఱికిపందలింక నెట్లుదిరిగివత్తురు? శ్యామమోహన!
కడునలసితివి. కొంత సేపు విశ్రమించుము.

(బుడ్డన్ సాహెబు ప్రవేశించి) దేవా! సలాంఖర్తో. నాయనగారూ మీకి
పత్రం పంపేరూ.

శ్యా—ఏటు దెమ్మన్మ. (విప్పుచు) కిందు మోపమోఖదమా? (చదువు
కొని) ఎంతసంతసము! ఎంతసంతసము!

బుద్ధి—శ్యామమోహనా! అంతటి సంతోషదాయకమగు వార్త యేమింటి?

శ్యా—దేవా! నాయర్ధాంగికి మడబిడ్డలు. అందు మగబిడ్డలు జన్మించిరట.

బుద్ధి—ఎంతయానందదాయకమగు వార్తవింటిమి! శ్యామమోహనా! పతివ్రతాతిలకమైన నీభార్యవలన నీజన్మమెంత పావనమయ్యె!

శ్యా—దేవా! ఇకనునన్ను వీడ్కొలుపుదురా?

బుద్ధి—ఇంతత్వరితముగానా? కొలఁదికాలము నాతో నాగుము. శత్రువులు తిరిగి రాకుండుటకు చింతాలోచన సేయునపుడు నీసహాయము నాకుఁ గట్టావశ్యకమైనది. ప్రస్తుతము నీవు నాకొనరించిన మహోపకారమునకు నీఋణమెట్లు దీర్చుకొని కృతార్థుఁడనయ్యెదనో దోఁపకున్నది.

శ్యా—అటులైన సేవకా!

బుద్ధి—చిత్తము సర్కార్!

శ్యా—(జాబువ్రాసి యిచ్చి) సేవకా! ఈ జాబును మజ్జనకునకిమ్ము పొమ్ము.

బుద్ధి—చిత్తంసర్కార్! సలాంఖుర్తుం. (నిష్క్రమించును.)

---

## చతుర్థాంకము:—చతుర్థరంగము.

(అ డ వి)

(రత్నమంజరి తనయద్వతి పసికూనలఁ బరుండబెట్టుకొని)

కీర్తన - "సోదరా! యింత జేసితివిరా" వలె

న్యాయమా? నీకుప్రాణనాధ!
నీయాత్మజులిట - నాఁకటిచేతఁ - కావుకావు మనియేడ్వఁ గనిదువరా॥న్యాయమా?॥

1. కన్నులు తెఱువని - కూనలు నీకేటు - ద్రోహముబన్నిరో - యిటుసేయఁగను? ॥న్యాయ॥

(స్వ) "రత్నమంజరిని దక్షిణమే తనయిద్దఱి బిడ్డలతో నరణ్యమునకుఁ బంపుము. అటులపంపని యెడల రాజ్యమునకుఁ దిరిగిరాన"ని నర్దయుఁడవై యాజ్ఞ నీయనావలన నేరమేమి? ఒకవేళ నీకఠినశిక్షకు నేను పాత్రురాలనయ్యెదను గాని పుట్టియొడలారని యీపసి గందులెట్లు మీశిక్షనొందనర్హులు? ప్రాణేశ! నీకీదుర్బుద్ధి లెట్లు పుట్టె? పుత్రునంక పీఠమున నుంచుకొనని వాని భోగములెల్ల రోగతుల్యములుగదా? తనయు నాలింగనముఁ జేసికొనని వాని మేను మ్రానుగదా? సూనుండు మెలఁగుచుండని గీము పెను తూముగదా? శిశువుల పలుకులు వినలేని శ్రోత్రములు గుహలు గదా? కొమరుని ముద్దిడుకొనని వాని యాననము పెనముగదా? ప్రాణేశ! నాపైనింత యాగ్రహముఁ జూప నానేరమేమి?

సీ. ప్రియనాధ! దయమాలి ♦ భీకరమ్ముల వేడి
చూపులీమగువపైఁ ♦ జూపనగునె?
పాపపుణ్యము లేక ♦ పటుబాహుబలమును
గోమలిపైఁ జూప ♦ నేమమగునె?
జారచోరాదుల ♦ జక్కాడు క్రోధమీ
తరుణిపైఁ జూపంగ ♦ ధర్మమగునె?
శాత్రవపక్షపై ♦ సాధించునీర్ష్యయీ
మదవతిపై ♦ సదయుఁడవఁట?

గీ. రాజసుతులపై ఘోరాజి ♦ రగులునీప్ర
తాపమీ దీనవదనపైఁ ♦ జూపనగునె?
అవనినావంటి నిర్భాగ్య ♦ రాలిపైన
నిట్టి సామర్థ్యమునుజూప ♦ నెట్టులగునో?

నాధా! నిన్నేలదూరవలయు? ఏది యెటులజరుగవలయునో యట్టులే

తత్కాలమునకు జరిగి తీరవలయును. జగత్కల్యాణ్యమూర్తియైన భగవంతుఁడీనాటక సూత్రధారుఁడై యాయాపాత్రల నాడించుచుండ నిన్ననవేల? మనుజునకు మేలు కీడులొకటి వెనుకనొకటి వెంటాడుచుండు.

సీ. కలిమిలేములు రెండు • కావటికుండల
　　ని, బుధులు నుడువంగ • నిజముగాదె
సుఖదుఃఖములురెండు • జూడఁజూడఁగ జీవి
　　తాంబుధిపైఁదేలు • నలలుగావె
మంచిచెడ్డలు రెండు • మనుజ జీవితమందు
　　దలపంగ నిలబుద్బు • దములుగావె
మోదఖేదములిల్లు • ముందువెన్కలుబుట్టి
　　రాలెడువృక్షప • త్రములుగావె
గీ. ఎండమావులవలె దార • సించియుండు
మేలుకీడులందొకరీతి • మెలఁగుచుండి
సర్వకాలంబు నిజధర్మ • సమితినిర్వ
హించి యలరారు ప్రాజ్ఞుండు • యంచితుండు.

భక్తఫలప్రదాయకా! నాకు దిక్కేది? ఏమిసేయుదాన?

గీ. ఆర్థిపారిజాతంబునా • కాశ్రయంబు;
దీనవత్సలుఁడెయుళింద • దేవసురభి;
భవవిదూరుఁడెమత్ప్రాణ • పరమహితుఁడు;
భక్తజనపోషకుఁడెనాకుఁ • బట్టుగొమ్మ.

(నిష్క్రమించును.)





శ్రీరస్తు.

# రత్నమంజరి.

## నాటకము.

### పంచమాంకము—ప్రథమరంగము.

భవనము. ]

(సమరసింహుఁడు ప్రవేశించి స్వ) కుమారా! పట్టినపట్టు విడువక నీయిష్టానుకూలముగా వివాహమాడి యింతదనుక నల్లార్పు ముద్దుగాఁ బ్రేమించిన యిల్లాలిని బసికూనలతో నడవుల పాలేయుమని నాకుఁ గమ్మలిఖియింప నీమనస్సెట్లొప్పె? ఎంతఘోరము! ఎంతదుర్భరము! శిశుహత్యయు, స్త్రీహత్యయుఁ గావించి మహాపాతకము వడిఁగట్టుకొని యెట్టులఁ జరియింతువు? ఈభారము నీవే మోయలేక కాఁబోలును కొంతనాపై విడచితివి.

(శ్యామమోహనుఁడు ప్రవేశించుచు స్వగ)

శ్యా—రత్నమంజరీ! రత్నమంజరీ! .................. ప్రత్యుత్తరము లేదు. జనకుఁడేలకో విషాదమగ్నుఁడై యొకమూల నాసీనుడై యున్నాఁడు. (ప్రకా) జనకా! రత్నమంజరి యెచటనున్నది?

సమ—రత్నమంజరి యేల కానవచ్చును? పసికూనలతో రత్నమంజరి నడవులకుఁ బంపుమని నీవు వ్రాసిన యుత్తరము నింతలో మఱచితివా?

శ్యా—హా! ఏమది! ఏమది! రత్నమంజరి నడవ్వులక్షంపిత్తివా? హా! ర త్నమంజరీ! హా? ప్రేయసీ! (మూర్ఛిల్లును.)

సము—కుమారా! ఇదేమిమాయ? నీవు వ్రాసినటుల నే నీయాజ్ఞ జవదాటక పంపలేక......పంప...లేక...తుదకు హృదయమును... రాయిఁజేసికొని నీయిల్లాలిని గాంతారవాసమునకుఁ బంపితి. ఇందు నానేరమేమి?

శ్యా—హా! నిజముగా................నిజముగా...నే...... నటు...లిఖయించితినా? (కూర్చుండి) హృదయమా! హృదయమా! నిజముగా నీవట్లే వ్రాయుమని హస్తమున కాజ్ఞయిడితివా? హస్తమా!......హస్తమా!......బొంకవలదు. నిజముగా నీవట్లే లిఖయించితివా?......లేదు...లేదు. ఈ మోస మెట్టుల జరిగెనోగదా? భార్యభర్తలకు, బిడ్డలకుఁ దండ్రులగు వియోగదుఃఖంబు వడిగట్ట నీకార్యముఁ బూనిన నీచాధమా ఇట్టి ఘోరకృత్యము సలుపనెటుల సాహసించితివి? ఈమాయాతంత్రము బూనిన నరాధముఁడు నాకంటఁబడునేని నాలుక్క చీలికలుగా దునుమాడి వాని మాంసముఁ బక్షులకెరగా వేయకుందునా? జనకా! నీవందిన లేఖ నిటుదెమ్ము.

సము—తనయా! ఇదే చూడుము (జాబునిచ్చును.)

శ్యా—(చూచి) విషయమునే నెఱుఁగకపోయిన నీవ్రాలించుమించు నా వ్రాలునే పోలియున్నది. ఆహా! ఇక్కార్యమొనరించువాఁడు తప్పక వ్రాలు సందేహింత నేర్పరియై యుండనోపు. ఓరి బుడె సాహెబ్!

బుడ్డె—(ప్రవేశించుచు) చిత్తం సర్కార్!

శ్యా—నాఁడు నా యొద్దనుండి యుత్తరము దెచ్చునపుడు మార్గమందెచ్చటనేమేమి జరిగెనో పూసగూర్చినటుల సత్యము వలుకుము. లేదా నీప్రాణములపై నాశవిడువుము.

బుడ్డె—సర్కార్ ! మీకి హుతీ్రం హప్డు నాకియిచ్చేరు హాంకు ఘుర్కు ఫిర్కే ఆతేత్స్తా ఆమ్మె హుంట్లేదూ హక్డా బడారాణి, శకీ్రవ ర్తి ఔరత్ ఆమ్కే నన్ను గిర్మేఖడాకరె హచ్చాతాడిసరాబ్ దియా. హం హచ్చాపియా. హప్డుబాగా సోగయం. హక్డరాత్రి హేంజరిగిందో హాంకుమాలుంనై సుబోమే వుట్కె రేమేరా రస్తా హోజాతాహ్యం.

శ్యా—నీవు నిదు్రించునపుడు నీయొద్ద నుండి యుత్తరమెవ్వరైనఁ దీసి కొనిరా ?

బుడ్డె—హది హాంకుమాలుంనై సర్కార్.

శ్యా—తా్రిగినస్థితిలో జరిగిన సంగతి నీవెఱుఁగవుగాఁ బోలు.

బుడ్డె—ఆఁ ఆఁ, హదిరాజా !

శ్యా—(స్వ)—చకీ్రవర్తిని యేల యీ మాయోక్తి బూనును ?

... ... ... ... ... ...

తానీకార్యముఁ గావింప నుద్యుక్తురాలుగా దేని భటుని రాత్రి యింట నిలిపి, మత్తుగొల్పు మధుపానమిడనేల ? తనభర్తకు యుద్ధమందునేఁ దోడ్పడి కావించిన యుపకారమున కిదియే ప్రత్యుపకారముగాఁబోలు. నిజము నిలుకడపైఁ దెలియును. హా ! రత్నమంజరీ ! నేనెంత పాపిష్ఠిని. యుద్ధమునకు వెడలవలదని నీవెంత నివారించినను నాడు వారలమాటలు వాడుదారులపేటలను మాట నీయెడ సార్థకపఱచి వెళ్ళి నిన్ను కాననముల పాలుజేసితి. రత్నమంజరీ ! నిజముగా నీవు నాకిఁకఁ గాన్పింతువా? ఇది నారిత్త కోరికగాక వేరొండుగాదు.

సీ. రత్నమంజరియను ♦ రమణీయనామంబు
నోరూరఁ బిలువఁజే ♦ కూరుటెపుడొ ?
పూర్ణ శశాంకుని ♦ బురుడించునగు మోము
కాంతులు నామేడఁ ♦ గలుగుటెపుడొ ?

జల జాతములునేల ♦ నలివేణి కనుదోయి
తిరిగి నావంకకుఁ ♦ దిప్పుటెపుడో ?
హరిణాక్షి దరిజేర్చి ♦ సరసోక్తులాడఁగ
కౌఁగలించెదు ప్రీతి ♦ గదరుటెపుడో ?
అధరామృతంబునా ♦ కనువారఁబోనగూర్చి
ముద్దాడి నాతోడ ♦ మురియుటెపుడో ?
గీ. నెలఁతతోడిద లోకమ ♦ ని దలపోయ
యీడులేని సమ్మోదంబు ♦ నెనఁగుటెపుడో ?
సుదతి ! నీచేత నామెచ్చు ♦ సుఖములెల్ల
నొంది యమరలోకంబునే ♦ నందుటెపుడో ?

జనకా ! నా యర్ధాంగి నన్వేషణార్ధమై యిదే పోవుచున్నాను. నాయదృష్టభాగ్యంబున నాప్రియురాలింగంటినేని దిరిగి నీరాజ్యమున కరుదెంచెదను. లేదా నాపై భ్రమలు వీడుము. ఇదే వెళ్లుచున్నాను. (నిష్క్రమింతురు.)

---

## పంచమాంకము—ద్వితీయరంగము.

---

[అ ర ణ్య ము.]

[రత్నమంజరి తన బిడ్డలతో నరణ్యమందుండును.
తెరలో ఆనందయోగి]

రాగ-కల్యాణి. కీర్తన. తాళ-ఆది.

"ఆరోగ్యము సకలార్థసాధన"ఫలె.

1. అనయము మనమున - వెలిగెడుజ్యోతి - ననుసరింపరే మానవులు!

వినయవివేకములను దగవిడచి - ఘన ధనబలములు - స్థిరమని యెంచి, మనస్సాక్షిని మొదలంట నఱికి - మోక్షమార్గము గాన రుగా ॥అన॥

రత్న. —(స) ఎవఁడో యొకఁడు భక్తిగీతములు పాడుచు నీదెస వచ్చుచున్నాఁడు. ఇతనివలన నా కేమైన మేలు ఘటియించునేమో.

[ఆనందయోగి ప్రవేశించుచు]

2. హృదయమనెడు సింహాసనముపై - పదిలముగా సదా కూర్చుండి విధికృత్యములను - విశదముగా మరి పదేపదే బోధించుచునుండఁ - బరమాత్మని శబ్దమునాలించి పామరులందరే మోక్షమును ॥అన॥

రత్న—అయ్యా! మీ రెవరు?

ఆన—అమ్మా! వనముల గ్రిమ్మరుచుండు నొక మునీంద్రుఁడను. నా పేరానందయోగి.

రత్న—నాయనా! నమస్కృతులు. మిమ్మును చూడఁగాఁ బెన్నిధిఁ గాంచిన పేదరీతిహృదయమున హర్షమొందితి.

ఆన—తథాస్తు.

రత్న—మీ వంటి ఋషిసత్తముల పాదాబ్జములకు మ్రొక్కఁగాఁ గరములు లేని మందభాగ్యురాలను. క్షమింపుము తండ్రి!

ఆన—కుమారీ! భక్తికి బ్రధానమైనది హృదయముగాన కరవిహీనురాలనైనంతమాత్రముననే భక్తి నీయందుఁ గాన్పించకపోలేదు.

రత్న—తండ్రీ! కడు శోచనీయమైన నాచరితంబు నాలించి మీరైనంత సహాయ మొనరింతురా?

ఆన—అమ్మా! నీ బాల్యమునుండి నీ వృత్తాంతమంతయు యోగదృష్టిచేఁ జూచుచునేయున్నాను. సాయంసమయమగువేళ నెండమా

వులు తమంత మామే హరింపఁబడినటుల నీ కష్టములన్నియు నేఁటితో నీడేరు.

రత్న—స్వామి! ఈ మందభాగ్యురాల కంతటి పుణ్యములు ఫలించునా?

ఆన—అమ్మా! నా పలుకులు నీకు విశ్వసనీయములు గ కున్నవిగదా?

సీ. మానివాసములు హ • ర్మ్యవితానములు మాకు
మది పరుల్ పూనిన • పూదురుగాక
సన్న్యాసవిధిని గా • షాయధారుల మమ్ము
చిఱునవ్వి పరిహాసిం • చెదరుగాక
సర్వాంగభూతి ని • చ్చలు ప్రకాశింప నీ
సంయమిత్వము ప్రశ • స్తముగుగాక
నిశ్చలభక్తి మ • న్నించెడు జపమాల
పరుల దుర్నిం జే • డ్పలుచుగాక

గీ. సంస్కృతిని నందువారలు • సలుపునట్టి
దుష్కృతులు సంస్కృతిని వారి • ద్రోహిఁ జేయు
సన్న్యసించిన వారిని • జగము నమ్మ
కునికి, తమ తప్పిదము కాక • యొరులకగునె?

అమ్మా! సజ్జనుల సద్గోగతికిఁ గ్రుంగఁద్రొక్కవలయునని దుర్జనులు పన్నాగములు వెదకినను నగ్నిజ్వాలలు సదా యూర్ధ్వముఖమున కేగయునటుల సన్మార్గులు వృద్ధిఁ గాంచెదరు. ఈ సాద్గుణ్యము తప్పక నీకన్వయించును. నీకు మహా మేలుగలుగనున్నది. ఇందులకు నిదర్శన మిపుడే కనులారఁ గాంచెదవు. (తలపై హస్తమిడి)

ఘం. అరమరలేక నమ్మమిదె • యంగన యెప్పటియట్ల [illegible]
గరములు పుట్టుగాక

రత్న— నిటు • గాంచఁగ చిత్రమెమీ మహాత్వముల్ ;
చరణయుగంబుఁ బట్టుకొని • శ్రద్ధను మ్రొక్కెదఁదొల్త నింకనుఁ
గురువుగ నమ్మియుండెదను • గూర్పఁగనింతటి మేల్మహాశయా!

అన—తల్లీ ! నీభర్త నీకై చింతిలుచు నడవులలోఁజొచ్చి పొదరిండ్లు గుహాలు వెదకుచున్నాఁడు. నీపతి రేపో మాపో యిక్కడికి కరుగు దెంచును.

రత్న—నాయనా ! నిర్దయుఁడై నన్ను నాపసికందులతో నరణ్యమునకుఁ బంపుమని తండ్రి కాజ్ఞాపించిన నాభర్త యిందేలవచ్చును ?

అన—రాపట్టీ ! నిరపరాధియైన నీభర్తను నిందింపకుము. ఈ కృత్యము గూడ నీసవతితల్లియే చేసెను. ఇంకఁ రమ్ము. నీభర్త వచ్చునం తదనుక నీబిడ్డలతో నా యాశ్రమముననే యుండుము.

రత్న—తండ్రి ! తమ సందర్శనముచే నేనెంత ధన్యరాలనైతి ! నాయ నా ! మీ చిత్తానుకూలముగా మెలంగెద.

(నిష్క్రమించును).

---

(శ్యామమోహనుఁడు ప్రవేశించి)

కీర్తన—"ఎందుబోయితివో కనక సేవలె.

ఎంతెంత దూరితివో యింతీ ! - కాంతారవాసంబు బంపితినని॥
॥నన్నెంతెంత॥

1. అంతరాత్మ యెఱుఁగఁ గీ - డొకింతైన దలఁపలేదె - వంతముతో నే దుర్మార్గులు - కాంతరో ! మాయలుజేసిరో - చింతాసాగరంబునఁ బడఁద్రోసిరో ॥నన్నెంతెంత॥

2. తల్లపిసాలకిపోతివో - యిఁక నాధారమేమంటివో - పొలఁతిరో భయ

## రత్నమంజరి.

పడితివో - యీ పొదరిండ్ల దాగితివో - యీ వియోగదుఃఖంబు నెటులోర్తునే ॥నన్నెంతెంత॥

(న్వ) ఎచ్చటనుండియో పసికూనల యేడ్పులును జోలపాటలును వినఁబడు చున్నవి. నిత్య బ్రహ్మచారులైన ఋషిసత్తములుండు నీయాశ్రమమందుఁ బసిబిడ్డలుండు టెట్లు? రత్నమంజరి జాడలిందుఁ గాన్పింపకపోవుః (నిష్క్రమించును).



(ఆనందయోగి, రత్నమంజరి ప్రవేశింతురు).

ఆన—కుమారీ! నీవియోగక్లేశముచే మతిదప్పి యున్మాదచిత్తుఁడై వచ్చుచున్నభర్త నాలింగనముఁ జేసికొనుము. (చేయిపైకెత్తి దిక్కుఁ జూపుచుండును. వచ్చుచున్న శ్యామమోహను నెదుర్కొని)

రత్న.—హా! ప్రాణేశ! ప్రాణేశ! రక్షింపుము.

శ్యా—(కౌఁగలించుచు) మనోనాయకీ! నా యదృష్టభాగ్యముచే బ్రతికి యుంటివిగదా? క్షమియింపుము. క్షమియింపుము.

శ్యా—సీ॥ కలికిరో మనకిన్ని ♦ కడగండ్లు గలుగంగ
దోసమొరులకెంత ♦ జేసినామొ?

రత్న—ప్రాణేశ! వెతలెన్ని ♦ పరిఢవిల్లిననేమి
కీడులో బెనుమేలు ♦ గూడినంత

శ్యా—కూర్మితో నను జేరి ♦ కుస్తరింపఁగ నేఁడు
కరములు నీకెట్టు ♦ గగ్గెపడఁతి:

రత్న—కరుణార్ద్రహృదయుఁడు ♦ కమనీయచరితుఁడు
గురుమునీంద్రు కృపచే ♦ కరములొదవె

శ్యా—ఆ॥ వె॥ ఇయ్యెడల మిముగని ♦ యీ మేలు గంటిమి

వందనంబులింక • నందుమయ్య !

ఆన— ఇడుము లొందితిమని • యేమొ దలంపకు

ఫలముగల్గు ముందు • పార్థివేంద్ర !

శ్యా—మౌనీంద్ర ! ముందింక నెట్టి ఫలముగల్గునో వాకుచ్చి నన్ను ధన్యుని జేయుము.

ఆన—రాకుమారా! కతిపయదినములలో భౌమసామ్రాజ్యమేలు సార్వభౌముఁడ వయ్యెదవు.

శ్యా—ఏమి ! సార్వభౌముఁడనా ? ఎటులగుదును ?

ఆన—భౌమసార్వభౌమునకు జామాతవగుటచే.

శ్యా—సామంతరాజునందనుఁడనైన నేను సార్వభౌమున కల్లుఁడనైతినా ? ఈసంబంధమెటు లౌనఁగూడె ?

రత్న—నాథా ! నావలననేగదా ?

శ్యా—ప్రేయసీ ! ఇవ్విషయము నాతో వెలిఁబుచ్చక నెంతకాలము దాచితివి ?

ఆన—రాకుమారా ! నీవు నీ భార్యాపుత్రాదులతో భౌమదేశమున కరుగుడు. మీరు మారువేషములుదాల్చి, సార్వభౌముని మ్రోల నిలిచి న్యాయము విచారింపుమని వేఁడుఁడు. ఒకవేళ న్యాయము గలుగకున్న నధైర్యమొందక భగవంతుని భక్తివిశ్వాసములతోఁ బ్రార్థింపుఁడు. అమ్మా ! భగవంతుఁడు తన భక్తులయెడల దాసానుదాసుఁడై వర్తించుననుట మఱువకుము. మీకు మేలు సిద్ధించును. వెళ్లుఁడు.

శ్యా—మునీంద్ర ! నీకివే నమస్కృతులు.

ఆన—తథాస్తు. (నిష్క్రమించును).

—•—

## పంచమాంకము:—తృతీయరంగము.

(సభాభవనము.)

(బుద్ధిసాగరుఁడు సింహాసన మధిష్టించును. రత్నమంజరి మీనాక్షి అనియు, శ్యామమోహనుఁడు జయానంద మనియు మారుపేరులతో ప్రచ్ఛన్నవేషధారులై యుందురు.) (సమద బోనులోనిలిచి స్వగ) వీరురత్నమంజరియు, శ్యామమోహనులవలె నున్నారు. నేఁటికి నాగుట్టంతయు బయలుపడుఁగదా?

బుద్ధి—(స్వ) గీ. సింహపీఠినధిష్టించు ♦ జితరిపునకు
మోహబంధంబు లన్నియు ♦ నిర్మూలమగును;
భార్యనైనఁ దనయునుంగు ♦ భ్రాతనైనఁ
బ్రభువులెక్కింపఁడి త్తఱి ♦ వ్యాజ్యములను.

(ప్ర) కోమలీ! విమలపుర వాస్తవ్యుఁడగు జయానందము భార్యను కొన్నివత్సరముల క్రిందట నరణ్యములో భటులచేతఁ జంపించుటకు బ్రయత్నించితివనియు, నిటీవల జయానంద మింటలేనితఱి, తన భార్యయగు మీనాక్షిని వెంటనే తనబిడ్డలతో నరణ్యమునకుఁ బంపుమనియుఁ దప్పుడువ్రాలుతో నొక కమ్మలిఖించి మీనాక్షి మామపేరటఁ బంపితివఁట. ఇట్టిఘోరకృత్యము వడిగట్టనెటుల సాహసించితివి? ఎంతవిచారము! ఎంతాశ్చర్యము!

సమ—అవును. నాకు నటులే దోఁచుచున్నది.

బుద్ధి—చేసిన దుష్కార్యమునకుఁ బశ్చాత్తాపపడుచున్నావా?

సమ—కాదు. కాదు.

బుద్ధి—మఱి యెందుచేత?

సమ—గీ. వృషభమీానెనన్న ♦ నెట్టిశంకయులేక
గాటఁదోలుమనెదు ♦ ఘనులుగలుగ
నిరపరాధిపైన ♦ నెపము లెన్నెన్నియో
రాకయుండునె యిఁక ♦ లోకనాథ !

బుద్ధి—అపరాధివో నిరపరాధివో విచారించినఁగదా తెలియును. నీపై మోపఁబడిన నేరము చేసితివా ? లేదా ?

సమ—ఇదంతయు కేవల మక్రమము. నే నించుకైన నెఱుంగను.

బుద్ధి—సేవకా !

సేవ—చిత్తంప్రభూ !

బుద్ధి—మొదటసాక్షియైన అహమ్మద్‌ఖానుని బిలువుము.

సేవ—అహమ్మద్‌ఖాన్ ! అహమ్మద్‌ఖాన్ !

అహ—(ప్రవేశించుచు) హాయ్యా ! హోతంహై, హోతంహై.

సేవ—ప్రమాణముచేయుము. దేవునియెదుట.

అహ—దేవ్రనియెదుట.

సేవ—అంతా నిజము చెప్పుతాను.

అహ—అంతా నిజము చెప్పుతానూ ?

సేవ—అబద్ధమేమి చెప్పను.

అహ—అబద్ధమేమి చెప్పనూ ?

బుద్ధి—నీపేరు ?

అహ—అహమ్మద్‌ఖాన్.

బుద్ధి—నీవయస్సు ?

అహ—ముప్పై ఏండ్లు.

బుద్ధి—(కాగితములుచూచి) నీవు పదేండ్లక్రిందట నొకసారి సాక్ష్యము నకు వచ్చినపుడు నీవయసు ముప్పైయేండ్లని చెప్పితివి. ఇప్పుడును నీకు ముప్పైయేండ్లేనా ?

అహ—హాచ్చాసర్కార్ ! నేను హాట్లా హిట్లా వారిలాగ హీంరులాగ హాప్పుడేక్ మాట హింప్పుడేక్ మాట బోల్తానున్నై. నాది హెప్పు ఏక్ బాత్.

సమ—(స్వ) ఓహో ! ఇతనిమాటలు జూడ నాకొంప గూల్చునటు లున్నదే.

బుద్ధి—మంచిది. చక్రవర్తిని యాజ్ఞానుసారముగా రెండవవాది యగు మీనాక్షి నరణ్యములోఁ జంపయత్నించితివఁట. ఇది నిజమా?

అహ—సర్కార్ ! మీనాక్షి హంటె ఓ క్యావోకి? హాంకుమాలుంనై.

బుద్ధి—అనఁగా మొదటివాదియగు యితని భార్య.

అహ—సర్కార్ ! హీయన ఔరత్ కు నాకీహెందుక్ శంపేక్ ?

జయా—ఈమె అప్పటిలో నా భార్య కాదనుమాట నిజమే.

అహ—అవును సర్కార్ ! మేమంతా నిజంశ్తాం. దేకోరాజా !

(జయానిను చూపును)

జయా—నీవున్ను ఖుస్రోఖానుయు నొకకన్య నరణ్యములోఁ జంపుటకుఁ బ్రయత్నించి, చేతులాడక, ఆమె రెండుహస్తములు నఱుక లేదా ?

(అహ-సమదవైపు చూచుచుండును. సమద తల గీరునటుల నభిన యించుచు వలదని తల వెనుకచే సైగఁజేయుచుండును)

బుద్ధి—ఆలోచించు రేల! నిజముచెప్పుట కాలోచనగూడఁ గావలయునా?

సమ—అహమ్మద్ ! సత్యమే చెప్పుము.

అహ—సర్కార్! మాకు ముందు సత్తెంవాలున్నది. హెన్క శూస్తే అబద్ధమువాలుంది. ఆలోశనలేక హేల్లా శప్పాలె? పావం దేవిగారు హీయన ఔరత్‌కు సంపాలె అని హాంకు హెందుక్క శప్తాది?

జయా—ఇచ్చట పాపభీతులరయు నగత్యములేదు.

బుద్ధి—అధికప్రసంగము వలదు. అడిగిన ప్రశ్నమున కుత్తరమీావలయును. నీవీమె చేతులు ఖండించినావా లేదా?

అహ—దోహాతా నాఁ నర్క లేదు సర్కార్!

మీనా—ఒకచేయి మాత్రమీావు నఱికితివిగదా?

(అహ-మౌనముగానుండి సమదవైపు చూచుచుండును. సమద వలదని సైగజేయుచుండును).

బుద్ధి—అహమ్మద్! త్వరగా ప్రత్యుత్తరమిమ్ము.

అహ—హాంకు హిస్త జరా జరా యాద్‌హోత్తాహై. హామ్నా? హాంకు సర్కిన హాత్ దికా.

మీ—ఈ హస్తముగదా నీవు నఱికినది. ఎంతలో మఱచితివి? (ఒక చెయ్యి చాచును).

సమ—(స్వ) బ్రతికితి. బ్రతికితి.

అహ—సర్కార్! మాకీ అబద్ధాలు శేప్తామా? రాజు ఔరత్ జూట్ శేస్తె అది నిజం. మాకి సత్తెంబోలేతో అది జూట్ హావు తాది.

బుద్ధి—ఓయి జయానంద! నీ నిజమంతయు దెలిసినది. అంతఃపుర

కాంతలపై యిట్టినేరములు కల్పించి సభాభవనమున నిలుచుటకు నీగుండె గుండెయో బండయో గ్రహింపజాలకున్నాను. నీభార్య రెండుహస్తములు యథారీతిగానుండ నెవ్వరైన నీ నేరమెట్లు నమ్మెదురు? ఇఁక సాక్ష్యము విచారింపను. అహమ్మద్! నీవు వెళ్లిపొమ్ము.

(అహ-నిష్క్రమించును).

---

సమ—నాథా! నిరపరాధినిపై నట్టి నేరములెన్ని నీవంచకుల ధైర్య మిప్పుడైనఁ జూచితిరా? నిజము నిలుకడపైఁ దెలియును.

మీనా—అవును. నీ నోటిమాటయే స్థిరపడుఁగాక.

జయా—సార్వభౌమ! కరములు ఖండింపఁబడి యరణ్యములో దిరుగు చుండ నీ యువతీమణిని పరిణయమాడితి. ఇటీవల నీ చక్రవర్తిని తప్పుడువ్రాతలతో వ్రాసిన లేఖాప్రకారము మజ్జనకుండీ కాం తామణిని నరణ్యమునకుఁ బంపఁగా నచ్చట నొక మునీంద్రుని కృపారసముచేఁ గరములొదవె.

బుద్ధి—చాలు చాలు. నీమాటలిఁక నిలుపుము. (సమదవైపు జూచి ఉత్తరము జూపి) ఈ వ్రాతయు నీ వ్రాలును నీవేనా?

సమ—నావికావు. మొదటినేరమెంత యథార్థమో యిదియు నంతియే.

బుద్ధి—సమదయే యీ యుత్తరము వ్రాసెనని నీకు సాక్షులెవరు? ఉత్తరముఁ గొనివచ్చిన భటుఁడాలాగు జెప్పగలఁడా?

జయా—ఒడలెఱుంగకుండునటుల మద్యపానము ద్రావింపఁబడినందు చేత భటుఁడాలాగు చెప్పఁజాలడు.

బుద్ధి—ఈ నేరము సమదయే చేసెనని నీవెట్లు జెప్పఁగలవు ?

జయా—దివ్యదృష్టిచే దిలకించిన జడదారి మాకుం జెప్పుటచేత.

బుద్ధి—(కోపముతో) ఓరి! నీవెట్టికూఁతలిఁక చాలించుము. ఇట్టి వెట్టి వ్యాజ్యములన్నిఁటిని నెత్తినిడుకొని, యిల్లంతయు గుల్లజేసికొని దివాలెత్తిన నీవంటి పకీరులెందఱు లేరు? ఎవ్వఁడో జడదారియఁట పెడదారియుట. గాలిమాటలకుఁ గలవరపడుచున్నావా? సరియే. ఆజడదారి యిచ్చటికి వచ్చి సాక్ష్యమీఁగలఁడా ?

మీనా—ఆయ్యో దైవమా! యింకను సత్యము బయలుపడకున్నదా!

గీ. నిఖిల భువనపూత! యనంత! ♦ నిర్మలాత్మ!
భక్తజన లోకమందార! ♦ పరమపురుష!
తోడి తేలెమానినిటకు ♦ దొంగిలించినలె
సార్వభౌముఁ డింతటనైన ♦ సత్యమెఱుఁగు.

గీ. తరుణి శిరముపైఁ గేలిడి ♦ "కరయుగంబు
బుట్టఁగాక" ని వాకొంచ్చి ♦ సట్టె ఘనుఁడ!
సద్గుణవరుఁడ! పుణ్యాత్మ! ♦ సాధుశీల!
జనవె వాయువేగమున నీ ♦ సాక్షిబోవ?

[ఆకాశమునుండి ఆనందయోగి దిగివచ్చి నిలుచును.
బుద్ధిసాగరుఁడు లేచును.]